# బ్రిటిష్ ప్రభుత్వమువలన
# హిందూదేశమునకు గలిగిన లాభములు.

**1914**

# బ్రిటిష్ ప్రభుత్వమువలన

# హిందూదేశమునకుగలిగిన లాభములు.







దుగ్గిరాల:
ప్రబోధినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
కో. పార్థసారథిగారిచేఁ బ్రకటింపఁబడియె.
1914.

# PREFACE.

The benefits of British Rule are, of course, innumerable. Considering the limited time at my disposal, I was obliged to content myself with briefly explaining only the most important of them. I should have been glad to touch some more of the invaluable advantages of British Government in India, if time had enabled me to do so. My aim has been to convince the less informed of my fellow countrymen that the British rule has been a blessing to India, and that the Indians are under a heavy debt of gratitude to England for having saved India from the hopelessly miserable condition to which it was reduced after the death of Aurangzeb. To fulfil my aim I had also to do my best in removing some of the prejudices or mis-conceptions of some of the people of India. It appears to have grown into a habit with some of them to say :—

(i) that India became and is still becoming poorer and poorer because foreigners are taking away heaps of gold and silver from the country every year.

(ii) that the necessaries of life have become and are still becoming dearer and dearer rendering the cost of living abnormally high, that this is a great misfortune to the country, that the increasing and heavy taxation of the Government is the main, if not the only, cause of this charge for the worse and that the Government is therefore mainly responsible for this unhappy state of things.

In describing the benefits of the British Rule I thought it necessary to remove these prejudices by proving at some length how mistaken the foregoing conclusions are and how little the Government is to blame in the matter, if any body has to bear the blame at all.

2. I have to add a few words of explanations as to the catechetical form adopted by me. I first attempted to write simple ballad poetry but have changed my mind because of the disuse ballads have fallen into. In that form I feared my thoughts might not reach the school boys who are the future generation of India, and gave it up. Ordinary narrative form would not interest boys as the subject matter of this book cannot possibly be made as interesting as a novel. The effect of questions introduced into the book will be to pull up the attention of the readers as it drifts aside, to break the monotony of a lengthy narrative and make the subject lively and interesting. A similar method is recommended by educational authorities in teaching children.

3. As one who has enjoyed the very benefits of British Rule for more than a quarter of a Century I have felt a sort of delight in the thougt that, in writing a pamphlet of this kind I was discharging a most important duty to my Sovereign as well as to the less informed of my brother countrymen. I shall feel my labours amply compensated if this little work serves the humble purpose for which it has been produced.

AUTHOR.



# పీఠిక.

ఈ చిన్న పుస్తకము సుమారు నాలుగు సంవత్సరములక్రిందట ఇంపీరియల్ లీగువారి ప్రకటన ననుసరించి వ్రాయబడినది. ఇండియాదేశస్థుల కాంగ్లేయ ప్రభుత్వకాలములో గలిగిన గొప్ప మేళ్ళు సంగ్రహముగా నిందు వివరింపఁబడియున్నవి. కొన్ని విషయములందుఁ గొందఱకుఁ గల గొన్ని దురభిప్రాయములు దొలంగింపఁ బ్రయత్నము సేయఁబడినది. సహజ రాజభక్తి శోభితులగు మన దేశస్థులకీ పొత్తము సంతతానంద సంధాయకంబగునంచుఁ దలంచెద.

గ్రంథకర్త.

# విషయసూచిక.



# బ్రిటిష్ ప్రభుత్వమువలన

# హిందూదేశమునకుగలిగిన లాభములు.

శ్రీ సంశోభితమగు అయోధ్యా నగరమున రామశర్మయను విద్వాంసుఁడు కాపురం బుండును. పండితుఁడు తన కొమరులతోడ సరయూనదియొద్దకు వెళ్లి అక్కడ ఒక యిసుకతిప్పమీఁదఁ గూర్చుండి ముచ్చటలాడుచుండ పెద్దకొడుకైన భాస్కరుఁడిట్లనియె: "నాయనా! మన హిందూదేశము పూర్వము తురకలకులోఁబడి యల్లాడుచుండ నాంగ్లేయులు వచ్చి యీదేశ జనులను గొప్ప యాపదనుండి కాపాడిరని, ఈదేశమునకు వీరు చేయుచున్న మేలు ఇంతింత కాదని అప్పుడప్పుడు మాటలధోరణిని చెప్పుచుండ వినుచుంటిని. ఇపుడావిషయమెల్ల సవిస్తరముగ నాలకింపఁ గోరికగలిగెను. దయతోడ వివరింపుడని వేడ రామశర్మయిట్లనియె:— "భాస్కరా! ఆంగ్లేయు లీదేశమునకుఁ జేసిన మహోపకారమును ఆమూలాగ్రముగ వివరింపవలెనన్న నొకయేడాదియైనఁ జాలదు. కావున ప్రస్తుతము సంగ్రహముగఁ దెలియఁజెప్పెదను. అడుగునచిల్లిబడి నీళ్లుపోసుకొని మునిఁగిపోవుచున్నయోడను మునుఁగకుండ పైకెత్తితేల్చినట్లు ఘోరవిపత్తుల కాకరమై అరాజకస్థితిలోఁ జిక్కి యడలుచుండి తన్ను రక్షించువారెవ్వరైన గలరాయని కంటికి మింటికి నేకధారగా నేడ్చుచుండిన యీ రాజ్యలక్ష్మి కభయకరం బిచ్చి యాంగ్లేయమహాజనులు కాపాడిరి.

మంచిరెండలో మాడివచ్చినవానికిఁగాని చెట్టునీడవలని సౌఖ్యము తెలియరానట్లు, మిక్కిలి యాకలిగొన్నవానికిఁగాని యన్నము చవిదోఁచనట్లు, మన హిందూదేశము ఆంగ్లేయుల పరిపాలనమునకుఁబూర్వ మెట్టి దుఃఖకరమైనస్థితిలో నుండెనో తెలిసినంగాని యిప్పటి సౌఖ్యస్థితి యింతటిదని, ఆంగ్లేయులు మనకొనర్చిన మేలు ఇటువంటిదనిఁ దెలియజాలము.

హిందూరాజులు పరస్పరవిరోధములచే తమలో తాము పోట్లాడుకొనుచు ప్రక్కనగల ఆఫ్గనిస్థానములోని మహమ్మదీయరాజులను పిలిచి యీరాజ్యాల త్రిమ్మ నప్పగించిరి. షిదప పెక్కువందల సంవత్సరము లీదేశము కొంచెముగానో గొప్పగానో వారిచేతులలోఁ జిక్కియుండినది. అక్బరువంటి ధర్మబుద్ధి, సర్వసమత్వముగల రాజులకాలములో సుఖస్థితిఁబడసి దేశమభివృద్ధినొందుచుండినది. మహమ్మదు టోగ్లాకువంటి క్రూరచిత్తుల పరిపాలనములో నింతింతనరాని బాధలకు లోనైనది. తుదకు ఔరంగజేబుయొక్క హిందూమతద్వేషమున కోర్వలేక మిగుల దుఃఖించినది. ఔరంగజేబు 1707 వ సంవత్సరములో కాలగతినొందిన వెనుక ఆయనకొడుకు లొండొరులతో పోట్లాడుకొనుచు ఢిల్లీరాజ్యము నతిహీనస్థితికిఁ దెచ్చిరి. చక్రవర్తి బలహీనుఁడగుటచేనందందుగల రాష్ట్రములకు గవర్నర్లుగానుండినవారు వాస్తవముగా స్వతంత్రరాజులై ఆయాదేశములను తామే పరిపాలింపఁదొడఁగిరి. నవాబులనువారిట్టివారే. ఔరంగజేబుకాలములోనే పెరుగుచుండిన మహారాష్ట్రప్రాబల్యము అతఁడు గతించిన వెనుక మఱింత విజృంభించెను. ఇట్లు చక్రవర్తి బలహీనుఁడైనపుడును తత్పూర్వము అణఁగిమణఁగియుండినవారెల్లరు తలయెత్తి ఎవరికివారేపెద్దలైసంచరింపఁదొడంగినపుడును దేశ మెట్టిస్థితిలోనుండునో వేఱుగఁ జెప్పనక్కఱయుండదు. తోటఖామందు చెట్లక్షేమమును కోరునేగాని యిజారాదారున కట్టిబాధ్యతయుండదు. అట్టివాఁడు ఱెమ్మలు తునిగిననుసరే కొమ్మలు విరిగిననుసరే ఉన్నంతవరకు పండ్లన్ని రాల్చుకొనిపోవలెనని యుండును. ఆట్లే సహజమైన హక్కులేక హఠాత్తుగా ప్రభువులైన యీనవాబులు దేశము చెడిననుసరే దేశజనులు నశించిననుసరే వారినెల్ల పీల్చి పిప్పిచేసియైనను, దోచి దొమ్మిచేసియైనను, కూడినంతద్రవ్యము కూడఁబెట్టుకొనుటయే తమపనిగాభావించిచేసిన దుం

డగము లాగడము లిస్టి వట్టివని వచింప నయితికాదు. పాడిపంటలతోడ పచ్చనై కన్నులపండువై యొప్పుచుండిన నిండు పంటభూములనెల్ల ఎడారులుగఁ జేసి, మేడల మిద్దెలతోడ కళకళలాడుచుండిన పట్టణముల స్మశానవాటికలుగ మార్చిన రాజులును గలరు. ఔడు ( అయోధ్య ) రాజ్యము ఆంగ్లేయుల పరిపాలనలోనికి రాకపూర్వము పడుచుండిన పాట్లనెల్లఁ దలంచినచో నెట్టివారైన కంట తడిపెట్టికమానరు. రఘూదారసింగ్ అనుదుర్మార్గుఁడా రాజ్యములో నొక గవర్నరై తన సేనలను గ్రామములమీదికిఁబంపి చేయించిన క్రూరకార్యముల వినుటకును దుస్సహముగా నుండును. మేడలు పడగొట్టించి, యిండ్లను కూల్పించి, కొట్టములను తగులఁబెట్టించి, స్త్రీలను బిడ్డలను గూడ కనికరమింతయులేక కడుఁబాముల పాలు చేసెను. కొందఱను వలువలను నొలిపించి తరుమగొట్టించెను. పురుషులను పెకక్రిందను ఎఱ్ఱగా కాలిన పట్టుకారులతో నాలుకలు పట్టి పీకించెను. లోకములో నెన్ని క్రూరకార్యము లూహింపుటకు సాధ్యముగునో అన్నియును జేసెను. ఆంగ్లేయప్రభువు లెన్ని చెప్పినను వినక దేశము నాశనము చేయుచుండిన యా దుష్టుల నెల్ల దొలఁగించి అయోధ్యరాజ్యమును మన ప్రభుత్వము వారు తమ సంరక్షణలోనికి చేకొనిరి. అప్పటినుండి యెండినభూమిపైఁ జల్లనివర్షము కురిసినంతనే మిసమిసలాడు పచ్చని పచ్చిక మొలిచి క్రొత్తయందమొదవునట్లు, దయామయులు ధర్మపరాయణులగు నాంగ్లేయులయోధ్యారాజ్యమును వహించినప్పటినుండి యాదేశము దినదినాభివృద్ధి నొందుచున్నది. అయోధ్యారాజ్యము నొక యుదాహరణముగా జెప్పితినేగాని యించుమించుగా తత్ప్రాంతదేశమంతయు నిట్టిస్థితియందే యున్నది.

## బందిపోటుదొంగలు, నరహంతకులు.

ప్రజలక్షేమమును గోరుచు పాటుపడు బలవంతుఁడగు రాజు లేమియే దుష్టులెల్ల ప్రబలిరి. బందిపోటుదొంగల గుంపులు బయలు దేరెను. దోపిడులు హత్యలు అనుదినకృత్యములుగా నుండెను. కడుపార నన్నము కంటినిండ నిద్రయును నదిట్టిదంచెఱుంగక ప్రజలు గోడునఁ జెందుచుండిరి. ఏ తరుణమున నే మహారాష్ట్రులదండు వచ్చునో, యే సమయమున నే బందిపోటుదొంగలు పైఁబడుదురో

యను భయమునఁ గాపులు గుండెలు తటతటఁ గొట్టుకొన నడలుచు దినమొక యుగముగా గడుపుచుండిరి. ప్రతిగ్రామమునకును చుట్టు బలమైన కోట గట్టుకొని యొకయెత్తయిన మంచెమీఁద నుండి నలుదిక్కులు చూచుచు ఏవైపునుండి యేదొంగల గుంపు వచ్చునో యని కాపులు కాచుకొనుచుండిరి. ఆక్రూరులు గ్రామములపైఁబడి కన్నులు తెరవని గుడ్డిపిన్నపాపలపైనైన నావురంచు నేడ్చు నసహాయలగు నబలలపైనైన జాలివెంచక దారుణములగు కాఠారులం బూని జాగిలముల లీల నిండ్లం జొచ్చి చెప్పరాని చిత్రవధలఁ జేయుచుండిరి. కమ్మలు రాకున్న చెవులు గోయుటయు, ముక్కెరలూడి రాకున్న ముక్కులఁ జెక్కుటయు, కడియముల కొఱకు కాళ్లు నరుకుటయు, కంకణముల నిమిత్తము కరములు తరుగుటయు సామాన్యముగా జరుగుచుండెను. ఇంకను వారిండ్లం జొచ్చి దొరికిన ధనముతోఁ దృప్తినొందక మానవతులగు మానినుల కొనర్చుచుండిన యవమానమును సహింపఁజాలక యెందరు ఇల్లాండ్రు ఆత్మహత్యలం జేసుకొనిరో వచింప నయితి కాదు.

## మహారాష్ట్రదండులును, పిండారీమూకలును.

ఇట్టి మహారాష్ట్రదండులెల్ల నిట్టి పిండారీమూకలెల్ల సూర్యుని కాంతుల ముందర నిలువలేక నురగిపోవు చీకటులట్లు ఆంగ్లేయుల రాజ్యవిభవంబు ప్రకటంబయినంతన మటుమాయమైపోయెను. పూర్వము ప్రతిగ్రామము చుట్టు నుండిన కోటలెల్ల వానికిపుడు పని లేమి కడిపోయి నేలఁ గలసిపోయినవి. ఆంగ్లేయుల భుజబలమే, ఆంగ్లేయప్రభువుల బుద్ధిబలమే తిరస్కరింపఁగూడని ఖచితమగు వారి శాసనమే పెట్టనికోటలై రేయుంబవళ్లు కాపుల కేడుగడలై వారిని కాపాడుచున్నవి. వారికి కోటలెందుకు? కొత్తళంబులెందుకు?

## తగ్గుజాతి దొంగలు.

మహామ్మదీయ రాజుల కాలమున 'తగ్గు' లను జాతిదొంగలుండిరి. వీరు బాటసారులతోఁ డఁగలసి తాము సామాన్యులగు బాటసారులవలె ప్రయాణములఁ జేయుచు సమయముఁ జూచి వారి నందఱిని గొంతుల ఉరిబెట్టి చంపి వారి సొత్తులను సంగ్రహించి పోవుచుండెడివారు. ఇట్టి దుష్టులను గనిపెట్టుట యెంతేని కష్టము

గానుండినను ద దేశదీక్ష వహించి మనయాంగ్లేయ ప్రభువులు వారినందరిని బట్టి బంధించి శిక్షించి దేశమును నిష్కంటకముగఁ జేసిరి. ఆహా! ఈ దేశ జనుల కాంగ్లేయులొనర్చిన మేలు కలనైన మఱవ సాధ్యముకాదుగదా.

## దేశక్షేమము మొదటి గొప్ప మేలు.

భాస్కరా! ఆంగ్లేయప్రభుత్వము వారివలన మనదేశమునకు గల్గిన మేలు వివరింపుమంటివి. వినుము. పూర్వమున హిందూరాజులు రాజ్యము చేయుచుండినపుడు దేశమంతయు బలవంతుడగు నొక చక్రవర్తికి లోఁబడియుండక ఒక్కొక్క రాష్ట్ర మొక్కొక్క రాజునకులోఁబడియుండినది. "అంగ, వంగ, కళింగ" మొదలగు 56 రాజ్యములు ఈ భరతఖండమునందుండినట్లు వాడుకకలదుగదా. భారతయుద్ధమునం దెన్ని దేశముల రాజులు పాండవులతోడనైన కౌరవులతోడనైన గలసి యుద్ధముచేసిరో మన మెఱుఁగుదుము. ఈ రాజులందఱు కలసి పరస్పరమైత్రితో మెలంగుచు నెవరి రాజ్యమును వారనుభవించుచునుండక యెల్లపుడు నొండొరులతో పోట్లాడుకొనుచునే యుండిరి. భారతము అరణ్యపర్వములోని యీక్రిందిపద్యమును చూడనగు.

కం. అందులకు ధరణిగలనృప
నందనులెల్లను ముదంబునం బొరయుదు వే
డ్కం దమలోఁ గయ్యమ్ములు
గ్రందుకలేకున్న వారు కడునెయ్యమునన్.

ఈరీతిన రాజులు ఒండొరులతో యుద్ధముసేయుచుండునపుడు ఆయా దేశజను లెట్టిస్థితియందుందురో మనమూహింపవచ్చును. బలవంతుఁడగు రాజు దేశములను జయించి యితరరాజులనుండి కప్పములు గొనుటకు బయలుదేరి దండయాత్రసేయునపుడు శత్రురాజుల కోటలను పాడుచేసి పట్టణములపైబడి యిండ్లను తగులఁబెట్టి మేడలనుగూల్చి జనులనుహింసించి దోచుకొనుట సామాన్యముగా జరుగుచుండెను. బిడ్డలను జంపుటయు రాజస్త్రీలను చెఱఁబెట్టుకొని పోవుటయు సహజకృత్యములుగాఁ జేయఁబడుచుండెను. ఈ కార్యములు విశేషముగా పుహ

స్మదీయ రాజుల కాలములో జరుగుట మనము వినియున్నారము. ఇట్టి యవమానమును సహింపఁజాలక మర్యాదగల కుటుంబములలోని స్త్రీలందరు కోటలలో పెద్దచిచ్చుల నమర్చుకొని వానిలోనురికి ప్రాణహత్యఁ జేసికొనెడివారు. ఏ రాజునకైన నొక చక్కని కూతురుండెనా యామెకొఱకు ఇతర రాజులు పోట్లాడుకొనుటయు, విరోధియగు రాజెవ్వడైన బలవంతుడైయుండుట తటస్థించునేని యట్టివానికి తనబిడ్డనీయ నిష్టములేనివారు క్రూరులై కన్నబిడ్డలను విషముఁద్రాగించి చంపుటయు దటస్థించుచుండెను. అప్పటి కష్టస్థితులను దలంతుమేని యిట్టియిక్కట్టులపాలై జనులు ఎట్లు బ్రతికియుండిరా యని సందేహము కలుగుచున్నది.

ఇప్పుడన్ననో వందలకొలది రాష్ట్రాధిపతు లీదేశమునందున్నను ఎవరి రాజ్యమును వారు భయభక్తులతో పరిపాలించుకొనుచు ప్రజలక్షేమము నిమిత్తము పాటుపడుచున్నారు. ఇతర రాజుల రాజ్యములలో నొక ప్రాణినైన జంపుటకు వారికధికారము లేకపోవుటయుండ తమ రాజ్యములోనైనను నొక బిచ్చగానినైనను హింసించుటకు వారికధికారము లేదు. పూర్వము రాజునకు గోరెక పొడమెనేని తన దేశములోనెట్టి మర్యాదగల కుటుంబములోని స్త్రీనైనను చెఱబెట్టి తన యంతఃపురమునకుఁ దెప్పించుకొనగల్గియుండెను. చంద్రమతీహరిశ్చంద్రులపూర్వజన్మవృత్తాంతమువలన నిటతేటపడును. ఇప్పుడట్టి యధర్మ కార్యమొనర్పఁగలుగు దుర్మతియగు రాజు శశవిషాణముగదా. ధర్మపరాయణులు సరాక్రమతేజోవంతులగు నాంగ్లేయుల శాసనంబున నెంతటి బలవంతునివలననైనను నించుకంతయు భయపడవలసిన యవసరములేక ప్రజలెల్లరు కడుపులో చల్లకదలకుండ సుఖులై జీవించుచున్నారు.

## శత్రురాజు భీతి లేకుండుట - రెండవ గొప్పమేలు.

ఆంగ్లేయప్రభుత్వ సార్వభౌమత్వమువలన ఇండియాదేశములోని రాజులందఱు పరస్పరవిరోధములేవియు లేక నిరంతరము శాంతివహించి దేశక్షేమముకొఱకు పాటుపడుచున్నారు. ఇదియొక గొప్పమేలు. మఱియొక మేలు కలదు. ప్రపంచములోని రాజ్యాంగములవారిలో నాంగ్లేయులనుమించిన బలవంతులు లేరు న

లేకదా, వారితో సమానులును లేరని చెప్పవచ్చును. "సముద్రమునకు ఇంగ్లండు రాణి" అనగా ఓడబలము ఇంగ్లండున కధికముగా గలదనియు, ఈవిషయమున నాంగ్లేయులు తక్కిన ప్రభుత్వమువారినందఱిని మించియున్నారనియు, మనకుఁ జక్కఁగా తెలియును. ఈకీర్తి చిరకాలమునుండి మన ప్రభుత్వమువారికి కలదు. ఇట్టి పరాక్రమవంతులు సంరక్షించుచుండుటవలన నిండియాదేశమునకు చుట్టుపట్టులనుండు నేరాజ్యాధిపతులుగాని దీనిం గన్నెత్తియైన జూడఁజాలకున్నారు. పూర్వమన్ననో పశ్చిమదేశాధిపతులెల్ల రెంతమాత్రము బలవంతులైనను నీదేశముపైఁబడి దోచుకొని, కొల్లగొట్టి, ప్రజలను నానాహింసలపాలుచేసి పోవుచుండెడివారు. దీనికి రెండు ఉదాహరణముల మాత్ర మిచ్చెదను.

(1) అహమదు షాదురానీ అనుక్రూరుడు ఆఫ్గను సేనలతో హిందూదేశముపైబడి పట్టణములం బల్లెలనెల్ల కొల్లగొట్టి జనులను నిర్దయవృత్తితో పొడిచిచంపి అమితద్రవ్యమును జేకొని మరలిపోయెను.

(2) నాదర్షాఅను పారసీక ( Persian ) రాజు 1739 వ సంవత్సరమున ఇండియామీదికి దాడివెడలి కర్నాలునొద్ద సాదల్‌ఖాను నోడించి ఢిల్లీ నగరమును జేరెను. అప్పుడు మహమ్మదుషాయనునతఁడు ఢిల్లీచక్రవర్తిగా నుండెను గాని మిక్కిలి బలహీనుఁడగుటచే నతఁడు నాదర్షాను ఏమియు చేయలేకపోయెను. ఒకనాడు రేత్రి నాదర్షా చంపబడెనని వదంతిపుట్టెను. తోడనే ఢిల్లీ నగరవాసులు పారసీకసేనలపైబడి వారిలో కొందరిని మడియించిరి. ఉదయమున నీసంగతి నాదర్షాకు తెలియగానే అతఁడు ఢిల్లీనగరమును కొల్లగొట్టుఁడని తన సేనల కాజ్ఞయొసంగెను. అప్పుడుజరిగిన ఘోరకార్యము లూహింపవలసినవేగాని వచించుటకు వీలైనవి కావు. ఢిల్లీచక్రవర్తి ఆడుదానివలె నేడ్చుచుండి తనప్రజల రోదనధ్వనులను వినఁజాలక తుదకు నాదర్షాను బతిమాలగా అతఁడు దోపిడినిసిలిపి అమిత ద్రవ్యరాసులతో తన దేశమునకు మరలెను, అప్పుడు అమూల్యమణిఖచితమగు నెమలిసింహాసనమును, కోహినోరను విలువలేని వజ్రము అతఁడుతీసుకొనిపోయెను.

ఒకసారి పుణ్యక్షేత్రంబగు మథురానగరమున ( మట్రా ) ఉత్సవము జరుగుచుండగా 25 వేలమంది ఆఫ్గన్ రౌతులు అసహాయులగు యాత్రికులపైబడి

వారిని బల్లెములతోఁబొడిచియు, గత్తులతో నఱికియుఁ జిత్రవధ గావించిరి. జనులు నిండుగా నున్నయిండ్ల కగ్గిపెట్టి వారిని కాల్చిచంపిరి. యువతులను చెఱబెట్టి తీసికొనిపోయిరి. దేవాలయములలో గోవులనుజంపి వానిరక్తమును విగ్రహములకుఁ బూసిరి. ఆకాలమున ఆఫ్గనిస్థానముయొక్క సరిహద్దునకు సమీపముగానున్న దేశమంతయు పాడువడి స్మశానతుల్యమయ్యెను.

శత్రువులను దనభుజదర్పముచే నిలుపఁగల్గు బలవంతుఁడగు రాజు లేకపోవుటచే హిందూదేశము దిక్కుమాలినదై తలఁచినవాఁడెల్ల దానిపైఁబడుచుండ నేడ్చుచు చేయునదిలేక కడుబాముల పాలగుచుండెను. రాజ్యాభిలాష చేతగాని, ద్రవ్యాభిలాష చేతగాని, మతద్వేషముచేతగాని పురికొలుపఁబడి పారసీకులు, గ్రీకులు, యవనులు, ఆఫ్గనులు మొగలు లెందఱెందఱో పండినచేలవలె కన్నులపండువుగా గానబడుచుండిన యీయిండియాదేశమునఁ జొరబడి జనులనెన్నరానికష్టముల పాలు చేయుచుండిరి.

ఇప్పుడన్ననో యాంగ్లేయప్రభుత్వమువారి సంరక్షణలో నుండుటచే శత్రుభావముతో నీదేశమును తేరిచూడఁగల్గువారైన లేరు; ఇందు కాలువెట్ట సాహసించువారంతకన్న లేరు. మనప్రభుత్వమువారి యుత్కృష్టబలప్రతాపములెట్టివంచెఱింగిన ఆఫ్గనుప్రభువువారికి పరమమిత్రుఁడయ్యెను. హిందూదేశముపూర్వమెన్నికష్టములపాలైనను తుదకు అఖండ బలపరాక్రమ శేముషీవంతులగు నాంగ్లేయుల పరిపాలనలోనికివచ్చుట ఆదేశముచేసిన పూర్వపుణ్యఫలమేగాని వేఱుగాదు.

## ఆంగ్లేయప్రభుత్వమువారొనర్చిన మూడవమేలు రైల్వేలు.

ఇట్లు దేశమంతయు, అంతశ్శత్రు బహిశ్శత్రువర్జితమై పరిపూర్ణశాంతి ననుభవించుచుండుటచే నది శుక్లపక్షచంద్రునివలె నానాట నభివృద్ధిగాంచుచు వచ్చినది. ఈదేశాభివృద్ధికి మిగుల తోడ్పడినది. రైల్వేలు (ఇనుపదారులు) ఆంగ్లేయప్రభుత్వమువారు మనదేశపాలనమును బూనుకొనకపూర్వము ఇండియాలో ఇనుపదారియున్న పేరే లేదు. తుదకు సరియైన రోడ్లుకూడ లేవు. అపుడు జనులా

కయూరినుండి మఱియొకయూరికిపోవుట అతిదుర్ఘటమైన కార్యముగానుండెను.
మిక్కిలి ధనవంతులైనవారు సవారీలమీఁద వెళ్లెడివారుగాని తక్కినవారెల్ల కా
లినడకనుగాని ఎద్దుబండ్లమీఁదగాని పోవుచుండెడివారు. ఇట్టిప్రయాణీకుల దు
రవస్థ నేమనివర్ణింపవచ్చును. ఈబండ్లు కఱకురాలమీఁద దడదడలాడుచు నిటు
నటు నూగులాడుచు బోవుచుండునపుడు కడుపులోని యవయవములు కదలి అ
లకుతలమగుచుండెను. తలపోట్లకు మితిలేదు. ఒక్కొక్కసారి ఒఱకటుప
నేలమీదపోవుచుండునపుడు తలక్రిందైపడుటయు, బండిలోనివారి తలలు పగ
లుటయు, కాళ్లుచేతులు విఱుగుటయు సంభవించుచుండెను. ఎడ్లు ప్రోవతప్పి
ప్రక్కగోతులలోబండితోడబడుటయు గలదు. వర్షాకాలము ప్రయాణముచే
యుటకే వీలులేదు. ఒకవేళ చేసితిమా పైఁజెప్పిన దురవస్థలకుతోడు క్రొ[illegible]
రవస్థలు సంభవించుటయు గలదు. గాలివిసురునకు బండిపై చాపకొట్టుకొని
పోయెనా యిఁక చెప్పవలసినదేలేదు. చాపగాడ్పుదెబ్బకు నిలిచినను వర్షపు
జల్లు బాటసారులను నీటముంచి చలిచే గడగడలాడునట్లు చేయుచుండెను.
క్కొక్కసారి బండిచక్రములు బురదలో కూరుకొనెనేని బండిలోనివారందఱు
దిగవలసినదే. అందరు బురదలోదిగి వారిశక్తికొలది చక్రములను బట్టిత్రో
యఁగాఎద్దులనుబట్టిబాదగా అదృష్టాయత్తముగాబండికదలినసరే లేకున్న నా
పూటకా రొంపియందు కాపురము సేయవలసినదేగాని వేఱుగతిలేదు. ఇది
గాక నట్టేటిలో నున్నపుడు వరదవచ్చి కొట్టుకపోవుట మొదలగు ఆపదలు
పెక్కులుగలవు. ఇవన్ని యొకయెత్తు దొంగలభయము మఱియొకయెత్తు
గా నుండును. ప్రయాణీకులు రాత్రియంతయు గుండెలు పీచుపీచుమన క్షణ
మొకయుగముగా గడుపుచుండెడివారు. అట్టిపుణ్యజనులు తారసించుటయే సం
టస్థించెనేని యిఁక జరుగుకార్యము వేఱుగఁ జెప్పవలసియుండదు. మొ
మొదట బండివాని తలచీలుటయు పిదప బండిలోని పురుషుల గాత్రము
లు విఱుగుటయు స్త్రీలయాభరణములన్నియూడ్చి వేయబడుటయు, ఉన్న సొ
లన్ని యపహరింపఁబడుటయు సామాన్యముగా జరుగుచుండెను. ఇన్ని కష్టము
లకోర్చి ప్రయాణముచేసినను ఇపు డుదయమున భోజనముచేసి హాయిగా సు
ఖగోష్ఠిచేయుచు రెయిలుబండిలోగూర్చుండి రాత్రి భోజనమునకు చేరగల్గు ప్ర

దేశమునకు బోవలయునన్నపుడు ఇరువదిరోజులో నెలరోజులో పట్టుచుండెను. అప్పుడు కృష్ణా గోదావరి జిల్లాలలో నేదో యొక గ్రామమునుండి చెన్నపురికిఁబోయి రావలయునన్న నిపుడు సీమకుబోయి వచ్చుటకంటె కష్టతరమగు కార్యముగా నుండెను. ఆ కాలమున మనదేశములో బండ్లు వెళ్లుటకును వీలులేని అడవిమార్గములెన్నోయుండెను. కావున సరకులను ఎడ్లమీఁద వేసికొనిపోవుచుండెడివారు. లంబాడీతండాలని చెప్పబడుచుండిన యెడ్లగుంపులు మనుష్యులచే తోలుకొనిపోఁబడుచుండెను. నలచరిత్రయందుఁగూడ సార్థములనుగూర్చి చెప్పఁబడియున్నది. ఇట్టి వర్తకజనసంఘము అడవులగుండా ప్రయాణము చేయునపుడు విషజంతువుల బాధయును, క్రూరమృగములవలని యాపదలును మిక్కుటముగా నుండెను. ఆనాఁటికి దొరకిన మురికిగుంటల నీళ్లు త్రాగుటవలన ఆ సార్థవాహులు పెక్కు రోగములపాలగుచుండిరి. చచ్చినవాండ్లు చావఁగా ఎట్లెట్లో కొందఱు బ్రతికి గమ్యస్థానము చేరి పునర్జన్మ నెత్తితిమని భావించెడివారు. తీసికొని వెళ్లిన సరకులైనను వానకు తడిసినవి తడియగా, ఎండినవి యెండగా తుదకు ఎంతో కొంత చేరుచుండెడిది. ఇప్పుడన్ననో నేఁడు టెలిగ్రామిచ్చిన మూఁడవనాఁటికెన్ని వేల బస్తాల సరకులు గావలసినను ఎన్ని వందల మైళ్లదూరమునుండియైనను మనకువచ్చి చేరుచున్నవి. ఆహా! ఏమి యద్భుతమైన మార్పు. రాజమండ్రిలోనున్నవారు చెన్నపురిలో కట్టిన పూలదండలను ధరింపవచ్చును. బెంగుళూరిలో కాచిన కాయగూరలను దినవచ్చును. కాయగూరలు మాత్రమననేల మత్స్య మాంసములను వందలకొలఁది మైళ్ల దూరమునుండి తెప్పించుకొని భుజించువారును గలరుగదా. ఏబది అఱువది సంవత్సరముల క్రిందట నిట్టిమాట జెప్పిన నిదియొక కట్టుకథయని భావించకుందురే? అహా రైల్వేలు ( ఇనుపదారులు ) మనదేశమునకు చేసిన మేలు నేమనిచెప్పవచ్చును!

## రైల్వేలవలనగల్గిన లాభములు.

పూర్వమే దేశమున పండినపంట ఆ దేశమున ననుభవింపఁబడవలసినదే గాని కొండొక దేశమునకు బంపుటకు వీలులేకుండెనుగదా. కావున ఒకయూరిలో జనులు అన్నములేక మలమల మాడుచున్నను మఱియొకయూరిలోనివారి

కెంతయున్నను సహాయముచేయఁజాలకుండిరి. కావున క్షామముగల్గిన దేశములోజనులు వేలకొలఁదినశింపవలసివచ్చుచుండెను. ఇప్పుడన్ననో కేవలముక్షామము రాకపోయినను ధాన్యాదులేమాత్రము ప్రియమైననుచాలును. చుట్టుప్రక్క దేశములనుండి వేలకొలఁదిమూటలువచ్చిచేరును.

(II) ఇట్లు క్షామకాలమున ప్రాణరక్షణగలుగుటయేగాక ఒక దేశములో పంట లెక్కుడనేయుండి మురిగిచెడక ధర హెచ్చుగాగల ప్రదేశములకుఁ బంపఁబడి యమ్మింపఁబడుటకు సౌకర్యము లేర్పడుటచే పంటకాపులును, వర్తకులును జురుకుగాపాటుపడుచు ధనవంతులైసుఖజీవులగుచున్నారు. దేశమంతయు ననేకవిధముల నభివృద్ధినొందుట కిది కారణమగుచున్నది. నాగరికతలేని దేశములవారు నాగరికులుగల గొప్పపట్టణములకు సులభముగాఁ బోగల్గుటచేఁ గ్రొత్తసంగతులను దెలిసికొనుచు తెలివితేటలు గలవారగుచున్నారు. ఇనుపదారుల (రైల్వేల) వలన దేశమునందుగల్గిన మార్పు లద్భుతముగానుండును.

(III) కొన్నివ్యాపారములకు రైల్వేలే కారణభూతములనిచెప్పవచ్చును. 1900 సంవత్సరమున 50 లక్షల టన్నుల రాక్షసబొగ్గు రైలుబండ్లమీద తీసికొనిపోఁబడినది. ఇందులో 20 లక్షలటన్నులబొగ్గు ఈదేశమునుండి ఎగుమతిచేయఁబడినది. ఇది అంతా అంతధనమేగదా. ఇట్లు కఱవుచే నన్నములేక మృతిఁజెందుచుండు జనులకెంతో దూరదేశములనుండిగూడ నన్నముఁదెచ్చిపెట్టి కాపాడుచు, కృషి వాణిజ్యాదుల నభివృద్ధిపఱచిజనుల ధనవంతులనుగాఁజేయుచు, వందలకొలఁదిమైళ్లను నాయాసముగాఁబోవుటకువీలుకలుగఁజేయుచు, అనాగరికులను నాగరికులనుగా నొనర్చుచు, అనేక గొప్పవ్యాపారములు బుట్టుటకును పెంపుగాంచుటకును కారణభూతమగుచు దేశమునకంతకును గ్రొత్తచుఱుకుదనమును, నూతనశోభను గలుగజేసిన రైల్వేలను వేసినవారెవరు? 1853 వ సంవత్సరమునకు బూర్వ మొక్కయినుపదారియైన లేదు. లార్డు డాల్ హౌజీ గారు దేశోద్ధారకులై రైల్వేలను వేయుటకు ప్రారంభించిరి. రైల్వేలు వేయుట మాటలతోనగు కార్యము కాదు. లక్షలు కోట్లకొలఁది ద్రవ్యము వ్యయపఱచి

నంగాని యొకయినుపదారినైన వేయఁజాలము. వేలు లక్షలుకర్చుపెట్టినఁగాని కావలసిన యింజన్లు, బండ్లేర్పడవు. ఇంతద్రవ్యము వెచ్చపెట్టి యిట్టి మహోపకార మీదేశమున కెవరుచేసిరో తెలియునా? ఆంగ్లేయమహాజనులేకదా. ఇంత తెలివిమీరిన యీకాలమునగూడ పట్టుమని పదిలక్షలు కర్చుపెట్టి యొక ఫ్యాక్టరీని బెట్టవలయుననిన నెంతకష్టముగానున్నదో మనకు తెలియనిది కాదు. మన దేశమునందు ధనికులు లేక కాదు ధనము లెక కాదు. తమ పెట్టెలలోనుండి ద్రవ్యము బైటఁబెట్టిన తుట్టతుదకది యేమగునో, లాభమో? నష్టమో? లేనిపోనియాపదలలో జిక్కుకొననేల? ఇంట బదిలముగా నుండిన చూచుకొని మురియుచుండవచ్చునని మనవారెందఱు తాళములపైని తాళములనువేసి కొట్లలో ధనమును భద్రపఱచి యుంచుకొనుటలేదు. అట్టిది ఇంగ్లాండెక్కడ! ఇండియాయెక్కడ! అక్కడనుండి కోట్లకొలది ధనమును దెచ్చి మనకొఱకీదేశమున వెచ్చపెట్టిన యాంగ్లేయమహాజనులనుగూర్చి మనమెంత కృతజ్ఞులమై యుండవలయునో యూహింపుము, భాస్కరా! ఒకనాఁడొక పుడిసెడు జలము ద్రావనిచ్చినవారి మేలుగూడ నెన్నటికిని మరువఁగూడదని మనధర్మశాస్త్రములు ప్రబోధించుచున్నది. అట్టిదిట్టి మహోపకారమొనర్చినవారినిగూర్చి యేమనిస్మరింపనగునో యూహింపుము. 1853 వ సంవత్సరమునకుపూర్వ మొక రైల్వేకూడ లేదని చెప్పియుంటినికదా 1901 వ సంవత్సరమున 28 వేలమైళ్ల రైల్వేలై యుండెను. ఆసంవత్సరమున 19 కోట్ల 50 లక్షలమంది ప్రయాణముచేసిరి. 4 కోట్ల 40 లక్షలటన్నుల భారముగల సరకులు తీసికొనపోఁబడెను. గంగ, గోదావరి, కృష్ణవంటి మహానదులకు దివ్యమయిన వంతెనలు కట్టఁబడినవి. ఈ రైల్వేల నిర్మాణముకొఱకు 1908 వ సంవత్సరమువరకు సుమారు 30 కోట్ల సవరనులు అనగా ఇప్పటి లెక్కనుబట్టి 450 కోట్ల రూపాయలను కర్చుపెట్టిరి. ఎడ్లబండ్లమీద ప్రయాణముకంటె రైలుబండ్లమీద ప్రయాణము మిక్కిలి సౌఖ్యకరమైనను టికెట్లకు, లగేజికి, చాలా ద్రవ్యమగుచున్నదిగదా యందువేమో? ఎడ్లబండ్ల ప్రయాణపుపాట్లును, కాలహరణమటుండ దానికగుకర్చులన్ని చూచినయెడల రైలుప్రయాణ మెంతో లాభకరముగానున్నది. ఈలెక్కను వేసిచూచినవారు సంవత్సరమునకు మనదేశపుజనులకు 150 కోట్ల రూపాయలలాభము మిగులుచున్నదని చెప్పి

యున్నారు. రైల్వేలవలన ప్రజలకేగాక ప్రభుత్వమువారికి గూడ ద్రవ్యలాభము మిగులుచున్నదని చెప్పియున్నారు. 1904 నుండి నాలుగు సంవత్సరములకు 3 కోట్లరూపాయల లాభము వచ్చినది. ఇదిగాక సేనను గావలసినచోటికి బంపుటకుపూర్వమయ్యే కర్చులో ఇప్పుడు 6 వ వంతు అగుచున్నది. ఇది యెంతలాభమో చూడుము. ఇదిగాక దేశసంరక్షణవిషయములో నొకగొప్పమేలు గల్గియున్నది. కారణాంతరములచే ఒకసేనను మనదేశపు సరిహద్దులకు బంపవలసివచ్చినదనుకొందము. పూర్వము 40 దినములకు చేరెడిసేన యిప్పుడొకటిదినములో వెళ్లి చేరగల్గియున్నది. ఎక్కడ ఏయవసరముగలిగినను అవలీలగా మనసేనలు వెళ్లి చేరుచున్నవి. ఇది దేశమున కెంతమేలో యూహింపుము.

## నాల్గవమేలు రోడ్లు.

మన యాంగ్లేయ ప్రభుత్వకాలములో ప్రజల రాకపోకలనిమిత్తము రైల్వేలేగాక అనేకమైన పెద్దపెద్ద రోడ్లువేయఁబడి ప్రతిసంవత్సరము జాగ్రత్తగా మరమ్మతుచేయఁబడుచున్నవి. దీనినిమిత్తము ప్రతిజిల్లాకు నొక డిస్ట్రిక్టు ఇంజనీరును, ఇద్దరుముగ్గురు అసిస్టెంటు ఇంజనీరులును, పెక్కండ్రు ఓవరుసీయరులును ఏర్పఱుపఁబడియున్నారు. పూర్వకాలము రోడ్లు ( రస్తాలు ) అను పేరుగలవి రెండువైపుల చెట్లునాటబడిన డొంకదోవలవంటివేగాని యిప్పటివలె చక్కని కంకరవరిచి దిమ్మిసగొట్టి బండిచక్రములు తేలికగా దొల్లిపోవుటకు వీలుగానుండునట్లు నున్నగాను గట్టిగాను చేయఁబడినఅందమైనబాటలు గావు.

## ఐదవమేలు వంతెనలు.

పూర్వము రాజులుకట్టించినవంతెనలు పేరుకైన నెక్కడను గానరావు. అక్కడక్కడ అరుదుగానుండిన చిన్నవంతెనలైనను ఆయా జిల్లాలలోని ధనవంతులు కీర్తిప్రతిష్టలకొఱకు స్వంతద్రవ్యమును వెచ్చించి కట్టించినవేను. ఇట్టివి పడిపోవుచుండెనా దానిని మరమ్మతుచేసి చక్కనిస్థితిలో నెట్టుకొను బాధ్య

త్తగలవారెవ్వరును లేరు. ఆంగ్లేయప్రభుత్వమువారిచే ఈ నూరుసంవత్సరములలో ననేక గొప్పవంతెనలు కట్టబడినవి. చెన్నపురిలోని అడయారువంతెన శ్రీకాకొళము సమీపమున నదిమీద కట్టబడిన వంతెనవంటివి ఇండియాలో వందలకొలందిగలవు. దేశాభివృద్ధికొఱకై ప్రజల సౌఖ్యమునిమిత్తమై ఆంగ్లేయప్రభుత్వమువారు పుచ్చుకొనిన శ్రద్ధయును, వెచ్చపరచిన ద్రవ్యమును నమితములుగా దోచకమానవు.

## ఆఱవమేలు నీటిపాఱుదలసాధనములు, జలాధారములు.

మహమ్మదీయరాజుల కాలములో ఉత్తరహిందూదేశమున కొన్ని కాలువలు త్రవ్వబడియుండెనుగాని ఔరంగజేబు గతించిన వెనుక దేశము అరాజకస్థితిలోనుండిన కాలములో ఆ కాలువలన్ని పూడిపోయి నామావశిష్టములైనవి. ఆంగ్లేయప్రభుత్వమువారి కాలములో అవియన్నియు చక్కబడుచుండ మన మెన్నడును కని విని యెఱుగని అద్భుతమైన సేతువులు కట్టబడినవి. కొన్నిచోట్లపైన పెద్దకాలువపాఱుచుండగా క్రిందుగా నొక పెద్దసెలయేఱు ఘోరున ప్రవహించుచుండును. ఇండియా పడమటకనుమలగుండా నొక బిలము త్రవ్వి దానిలో నొక పెద్ద గొట్టము నమర్చి అవ్వల పెరిగారి నదీప్రవాహజలము వృధాగా సముద్రమునందుబోయి పడకుండ దానిని ఆగొట్టముగుండా కనుమలకు తూర్పునకు దెచ్చి వానకురియని ప్రదేశములలో జలముపాఱించి యెండినయూళ్లను పండినయూళ్లుగాజేసిన ఆంగ్లేయుల బుద్ధికుశలతకును సాహసౌదార్యములకును మనంబద్భుతానందకందళితమగుచున్నది. ఆంగ్లేయులు పెక్కుడు మన సౌఖ్యమునిమిత్తమును అభివృద్ధికొఱకును ఎండయనక, వానయనక పనిచేయుచు, అడవులయందును, కొండలయందును ( ఇది ఆరోగ్యకరమైన దేశ మిది మన్యప్రదేశమని యాలోచింపక ) సంచరించుచు తమ దేహారోగ్యమునేగాక తమప్రాణములనుగూడ అర్పించియున్నారు. భాస్కరా! వీరినిమించిన ఉపకారులెవ్వరు? ఆంగ్లేయమహాజనులయెడ మన మెంతకృతజ్ఞత జూపవలసియున్నదో ఆలోచింపుము.

ఈకాలమున పంజాబుదేశమేగాక ఉత్తరహిందూస్థానమంతయు నీటికాల్వలమయమై యెక్కడజూచినను పచ్చనిపైరుతో నిండియున్నది. సింధుదేశములోని నీటిపాఱుదల సాధనములే లేకుండిన పంటలు పండుటకు సాధ్యమే కాదు. పూర్వము నిజముగానే అది బీడుభూములతోడను ఎడారులతోడను నిండియుండెను. ఒక నూఱుసంవత్సరముల క్రిందటి సింధుదేశమును ఇప్పటి సింధుదేశమును పోల్చినచో ఆదేశమే యీదేశమగునా! ఏమియాశ్చర్య మేమియైశ్వర్యమని మన మద్భుతపడక మానము. సింధుదేశమునుగూర్చి చెప్పినమాటలే ఇండియాయందలి అనేకదేశములనుగుఱించి చెప్పవలసియున్నది. ఇందుకు మన కృష్ణా గోదావరిజిల్లాలే నిదర్శనములు. వరదలువచ్చినపుడు దేశముపైఁబడియూళ్లమీఁదుగాఁ బ్రవహించి జనులను జంపుచు పశువులను సముద్రములోనికిఁగొట్టుకొనిపోవుచు ప్రమాదకారణంబై భయంకరములుగానుండిన యీ గొప్పనదులు మనకు భృత్యానుభృత్యులై తమజలమును మెల్లమెల్లగా చల్లచల్లగా మనకు వణకుచువచ్చునట్లువచ్చి ఒక్కొక్క పొలముకాపుయొక్క పొలము దగ్గరకును జేరి "నీ కెంతనీళ్లు కావలయునో తీసుకో, నీ కెంతనీళ్లు కావలయునో తీసికో" అని తెచ్చియిచ్చుచున్నవి. దీనికంతకును కాటను దొరగారి బుద్ధికుశలతయును పట్టుదలయును మనప్రభుత్వమువారికి మనపైఁగల దయయునే కారణములైయున్నవి. కృష్ణా గోదావరిజిల్లాలలో ఆనకట్టులు కట్టుటకు పూర్వముకాపులు వానకొర కాకాశమువంక దీనత్వముతోఁజూచుచు కంట తడిపెట్టుకొని నారాయణజపము చేయుచుండెడివారు. ఇప్పుడన్ననో వారికి ఆకాశముతోను పనిలేదు. నారాయణజపముతోను పనిలేదు. వారు హాయిగా కాలుమీదకాలు వేసుకొని కూర్చుండినను కాలువలు నీళ్లను దెచ్చి పొలములకిచ్చి ఒకటికి నూఱంతలుగా పంటలు పండించుచునే యున్నవి. 'అయ్యో! ఈనాఁడు ఎండకాయుచున్నదే, వాన కురియలేదే' యను చింత యావంతయును లేదుగదా. ఎంతయెండ కాయుచున్నను గోదావరి కృష్ణకాలువలనిండుగా జలము ప్రవహించుచునేయుండునుగదా. ఈనదులు ప్రవహించు దేశములలో నెక్కడ వానకురిసినను చాలును. ఆనీరు నదిలో వరదగాపాఱుటయు ఆనకట్టను ఆపి ఆనీటిని త్రిప్పి కాలువలగుండా చుట్టుపట్టుల దేశమంతయు (జలము) పా

జొంపటయు సంభవించుచున్నది. కావున కృష్ణా గోదావరిజిల్లాలయందు ఒక్క చినుకు వర్షము పడకున్నను వరిపైరు పూర్తిగా పండుట కేసందేహమును లేదు. పండ్రెండుసంవత్సరములు విడువక వర్షములు కురియకున్నను ఈజిల్లాలకు క్షామము రాదని అనుభవజ్ఞులు చెప్పుదురు. 20 లక్షలప్రజలకిట్లు సంరక్షక మేర్పాటుపఁబడినది. ఏదేశమునకైనను ఇంతకన్న గొప్పమేలుకలదె. ఇట్లుఎండి బీడుగా పడియున్న పనికిమాలిన భూములన్నిటియందు నవనవలాడు పచ్చని పైరుపండించి మనకాపులకు షడ్రసోపేతముగ, ప్రభుత్వమువారు అన్నముగలుగునట్లుచేసిరి; ఇదిగాక త్రాగుటకు దివ్యమైనజలమును, స్నాన సంధ్యాదులకు పుణ్యనదీజలప్రవాహములును ఊరూరనను పల్లెపల్లెకు లభించునట్లుఁజేసిరి. ఈశ్వరుఁడు కృష్ణాగోదావరులనిరెండునదులను నిర్మించిన మనప్రభుత్వమువారు వానిని నూఱునదులుగా జేసినారు. పూర్వము కృష్ణానదీ స్నానము చేయవలయుననిన నెన్నిదినములో ప్రయాణముచేసి వెళ్లినంగాని వీలుగాకుండెను.

ఇప్పుడు మనయూరుప్రక్కనుండియేఆనదీజలముపాఱుచున్నది. ఇది మన నైష్ఠికబ్రాహ్మణాదులకు గ్రామములయందు నెంత ప్రయోజనకరమో ఆలోచించుడు. ఇట్లు తినుటకన్నమును, త్రాగుటకు నీళ్లును, స్నానమునకు దివ్యమైనగంగయును మనవారికిపుడు ఆంగ్లేయమహాజనులవలన లభించినది. ఈ దేశమునకు ఆంగ్లేయులకన్న నుపకారులెవ్వరు?

### నీటిపారుదలసాధనములవలనదేశమునకుకల్గిన యితరలాభములు.

పూర్వము ఎండి బీడుభూములుగా పడియున్న పొలములయందు నిపుడు పుట్టి, పుట్టిన్నర, రెండుపుట్లు దివ్యమైన ధాన్యము పండుచున్నది. కావున పూర్వము 10 రూపాయలుకూడ చేయని భూములిపుడు 400, 500, 600 రూపాయలకుఁగూడ నిచ్చువారులేరు. కొన్నిభూములు ఎకరము 1000 రూపాయలు వెలగలవికూడ నున్నవి. కావున పూర్వము భిక్షాధికారులైన కాపులిపుడు అక్షాధికారులైరి. పూర్వము పూరిగుడిసెలతో నిండియున్నగ్రామము లిపుడు చక్కని పెంకుటిండ్లతోడను, మేడల మిద్దెలతోడను సొంపుగానున్నవి. పూ

ర్వము ముతకగుడ్డలు కట్టుకొనెడి కాపులకిపుడు కలితదుకూలవస్త్రములు, ఆల్పాకాకోట్లు, సీమాజామాలు, స్వారిచేయుటకు బైసికిళ్లు, లెవండర్లు, సెంటుబుడ్లు, హేర్ ఆయిల్సు కావలసివచ్చినవి. ఆంగ్లేయుల చల్లనిప్రభుత్వములో మనదేశము గాంచిన యభివృద్ధికిని సౌఖ్యస్థితికిని ఇంతకన్న మనకేమినిదర్శనము కావలసియున్నది. కృష్ణాగోదావరి జిల్లాలవిషయమున జెప్పినసంగతులే ఇండియాలోని యనేక దేశములనుగురించి చెప్పదగియున్నది. ఆంగ్లేయులు దేశమును పాలింపఁబూనుకొనుటకుముందు పంజాబుదేశము దారుణమైన యడవులతో నిండియుండినది. మహమ్మదీయరాజులు త్రవ్విన గొప్పకాలువ యెప్పుడో యెండిపోయియుండినది. ఒక్కపరగణాలో 221 గ్రామములు ప్రజలేలేక పాడుపడిపోయినవి. అడవుల దొంగలు, దోపిడిగాండ్రు, కూళలు చేరి చుట్టుపట్టులనున్న గ్రామస్థులను హింసించుచుండిరి. పులులు చిఱుతపులులు ఊళ్లలోనే తిరుగులాడ నారంభించినవి. ఆంగ్లేయులు రాజ్యమును పాలింపనారంభించినపిదప గల్గినమార్పు లద్భుతముగా నుండెను. పైఁజెప్పిన పెద్దకాలువను మరమ్మతుచేయించి దానిలో మరల జలమును పాఱునట్లుచేసినదేగాక లెక్కలేని అనేక కాలువలనుత్రవ్వించి దేశమంతయు ఫలవంతముగానొనర్చిరి. పూర్వము పాడుపడిపోయినగ్రామము లిప్పుడు జనులతోనిండి కళకళలాడుచున్నవి. పూర్వము పెద్దపులులు చిఱుతలు తిరుగుచుండిన ప్రదేశములలో నిపుడు గోధుమపైరులు చూచువారికి కన్నులపండువొనర్చుచు బరువైన తలలువంచి యానందముతో నూగుచున్నవి. ముఱికినీటితోనుండిన చవిటిపఱ్ఱలలోని నీళ్లను దొలగించి, వానిని సారవంతప్రదేశములుగా జేయుటచే నవి చక్కని సాగుబడికి యోగ్యములగుటయేగాక పరిసర గ్రామవాసుల కాయురారోగ్యముల నొసంగునట్టివైనవి. పూర్వము మన్యపుజ్వరముచే తీసికొనుచు వంధ్యలై వివాహనష్టులైయుండిన తమకుమార్తెలకిపుడు కాపులు సంతోషముతో వివాహములుచేసియానందించుచున్నారు. ఇట్లు కాపులు ధనవంతులగుటయే గాక ఆయురారోగ్యములనుబడసి సుఖులైవర్ధిల్లుచున్నవారు. పంటలు వృద్ధియగుటచే వర్తకవ్యాపారములు వృద్ధియైనవి. కర్మశాల లేర్పడినవి. బీదవారికి పనిగల్గియున్నది కావున వారికి దినగూడను కట్టనుగుడ్డకు కొదువ లేకున్నది.

# నీటిపారుదలయగుచున్న విస్తీర్ణము.

1858 వ సంవత్సరములో చెరువులవలన సాగుబడియగుచున్న భూములు కాక కాలువలమూలముగా పండుచుండిన భూములవిస్తీర్ణము సుమారు 15 లక్షలయకరములు. 1903-1907 వ సంవత్సరములోనన్నను 2 కోట్ల 22 లక్షల 25 వేలయకరముల భూమి సాగుబడియైనది. 1901 వ సంవత్సరమున ఒక్క పంజాబులోనే 16 వందల మైళ్ల పెద్ద కాలువలే యుండినవి. నీటిపారుదల సాధనముల విషయమై సుమారు 49 కోట్లరూపాయలు మన ప్రభుత్వమువారు వ్యయపఱచినారు. ఇందువల్ల కర్చులుపోగా నూటికి 8 వంతున లాభము తేలినమాట అటుండ యిట్టి నీటిపారుదలవలన నొకసంవత్సరములో పండినపంట 60 కోట్లరూపాయల విలువకు తక్కువయుండదు. కాబట్టి పెట్టుబడిపెట్టిన సొమ్ముకంటె ఎక్కువ ఫలము ఒక్క సంవత్సరములోనే మనకులభించినదని స్పష్టమగుచున్నది. దేశమునందలి సాగుబడిభూములకు నీరుపారించి దేశమున చక్కని పంటపండునట్లు చేయువిషయములో ప్రభుత్వమువారెంత శ్రద్ధవహించినదిని పైనజూపిన యంకెలవలననేగాక ఈక్రింది నీటిపారుదలసాధనముల పట్టికవలనగూడ స్పష్టముకాగలదు. (1) కృష్ణ (2) గోదావరి (3) కావేరి (4) పెన్నారు (5) పాలేరు నదులనుండి అనేక కాలువలగుండా నీటిపారుదలగావించుట (6) ప్రాతయమునా కాలువను చక్కబఱచుట (7) సింధుకాలువ (8) గంగానదకాలువ (9) బరీడోయబు కాలువ (10) బంగాళములోని సోను, ఒరిస్సా కాలువలు (11) సంయుక్తరాష్ట్రముయందలి లోయరుగంగ, ఆగ్రా, బెట్వా కాలువలు (12) దక్షిణయిండియాయందలి పెరియారు (13) కర్నూలు కాలువలు (14) బొంబాయిలోని నీరకాలువ (15) పంజాబుయందలి సర్హింద చీనాబు జలము కాలువలు (16) సింధుయందలి జాంరావు కాలువ ఇవి ముఖ్యమయినవి. ఒక్క సర్హిందకాలువయొక్క పొడవు 500 మైళ్లు. చానపిల్లకాలువ పొడుగు 500 మైళ్లు. పంజాబులోను సింధుదేశములోని కొన్నిప్రదేశములు పూర్వము మనుష్యావాసమునకనర్హములై కేవలము ఎడారులైయుండినవి. అట్టిస్థలములందిప్పుడు జనులు చేరి యిండ్లు వాకిళ్లు కట్టుకొని పొలములను సాగుబడిచేసి పాడిపంటలతో వర్ధిల్లుచున్నవారు, ఇంతకన్నను దేశోద్ధారకమైన కార్యమేదిగలదు?



ఒక్క చెన్నపురి రాజధానిలోనే 60 వేల చెరువులు గలవు. వీనివలన గూడ కాలువలు లేని ప్రదేశములయందు పల్లపుసాగుబడి జరుగుచున్నది. నీటి కాలువలవలన గల్గిన ముఖ్యమైన ప్రయోజనముగురించి యింతవరకు వివరించితిని.

## పడవలునడుచుకాలువలు.

అదిగాక యీకాలువలు పడవలునడుచుటకెంతో వీలుగానున్నవి. రైల్వే ఇంకను పడని ప్రదేశములలో ఈకాలువలే ప్రయాణీకులకును, సరకులను దీసికొనిపోవుటకును ఆధారములుగా నున్నవి. బండ్లమీద ప్రయాణముకంటెను పడవలమీద ప్రయాణము చాలా సౌఖ్యప్రదము. ఒడలు కదులకుండ హాయిగా కూర్చుండి గమ్యస్థానము చేరవచ్చును. పడవలమీద ప్రయాణము చేయువారు వేసవికాలములో కాలువలు కట్టివేసినప్పుడు బండ్లమీద పోవుటకెంతో శ్రమగా భావింతురు.

## క్రొత్తనీటిపాఱుదలసాధనములు.

ఇదివఱకుచేసిన పనులతో తృప్తినొందక ప్రభుత్వమువారు ప్రతిసంవత్సరమును క్రొత్తక్రొత్త నీటిపాఱుదలసాధనముల నేర్పఱుచుటకు ప్రయత్నము చేయుచున్నారు. గంజాము విశాఖపట్టణము జిల్లాలగుండా ప్రవహించు నాగావళి నదికి పార్వతీపురము సమీపమున ఆనకట్ట కట్టి యింతవఱకు వృథాగా పడియున్న భూములను పండించుటకు దొరతనమువారు ప్రయత్నము చేయుచున్నారు. పనులు చాలమట్టుకు పూర్తిఅయినవి. కృష్ణానదికి [illegible] (రిజర్వాయరు) కట్టి దానిమూలమున కొంతభూమికి నీరు [illegible] ప్రయత్నము చేయుచున్నారు. పంజాబులోని పెద్దనదుల జలమును [illegible]

చవలెనని యాలోచించుచున్నారు. ఈపనివలన పడమట సింధునదినుండి తూర్పు యమునానదివఱకు సింధు పంజాబు దేశములలోని యెండినభూములు చక్కని జలాధారము కలవగుచున్నవి. జీలమునదిలోని నీటిని చీనాబునదికి పారించి ఆ రెండునదులజలమును నొకకాలువగుండా పారించి ఆకాలువను రవినదిక్రిందుగా ప్రవహింపజేసి రవిసట్లెజి నదుల మధ్యనుండు నొక కాలువలో ఆనీరు పాఱునట్లుచేయ 20 లక్షలయకరములభూమి సాగుబడియగుననియు దీనికి 10 కోట్ల 50 లక్షల రూపాయలు కర్చగుననియు లెక్కవేయబడినది. ఇట్లు మనప్రభుత్వమువారు నిరంతరము మన దేశాభివృద్ధినిమిత్త మెన్నో ప్రయత్నములు చేయుచునే యున్నారు. ఇండియాయందుగల నీటిపాఱుదలసాధనములవంటివి ఈప్రపంచములో ఏదేశముయందును ఏరాష్ట్రముయందును లేవు.

## 7 వ మేలు హార్బరులు, సముద్రతీరమున దీపపు స్తంభములు, రేవుస్థలములు మొదలగునవి.

1 మనప్రభుత్వమువారు రైల్వేలు, రస్తాలు, ఆనకట్టలు కాలువలు మొదలగునవిమాత్రమేగాక, దేశమునందు వర్తక వ్యాపారము లభివృద్ధినొందుటకు చేయుచున్నపనులింకను చాలగలవు. ఇతరదేశములనుండి ఓడలు మన రేవుపట్టణమునకు వచ్చినపుడు సమీపమున లంగరువేయుటకు వీలులేక దూరమునందుండవలసివచ్చుచుండెను. పడవలంతదూరమువెళ్లి సరకులను దెచ్చుట యెంతో కష్టముగానుండెను. కొండలవలె అలలులేచి పడవలను చీకాకు చేయుచుండెను. ఇట్టి యిబ్బందులు తొలగునట్లు హార్బరులు బొంబాయి మదరాసువంటి ముఖ్యపట్టణములయొద్ద కట్టబడినవి. ఈ హార్బరులకు వెలపటసముద్ర మెంతకల్లోలముగా నుండినను లోపలిజలము చెఱువువలెనుండును. ఇందువలన పడవలు శ్రమలేక ఓడలనుజేరి సరకులను ఒడ్డునకు దీసికొనిరాగలుగుచున్నవి. మనుష్యులు ఓడలలో నెక్కుటకును ఎంతో వీలుగానున్నది. ఒక్కొక్కసారి పెద్దపెద్దస్టీమరులుకూడ హార్బరు గోడసమీపమునకు రాగలిగియున్నవి. కైరసనాయిలు డబ్బాలందువేసి పంపుటకుబదులు స్టీమరులలోని త

టాకములయందు నింపిపంపెదరు. ఆతటాకములనుండి గొట్టములమూలముగా హార్బరుప్రక్కనుండు కట్టడములలోనికి పంపుచేయుదురు. హార్బరులే లేకున్న యెడల నిట్టి సులభమైనపద్ధతి వీలేకాదుగదా.

## ఇతరకట్టడములు,దీపస్థంభములు,

హార్బరులేగాక ఓడలక్షేమనిమిత్తము ప్రభుత్వమువారు అందందు లైట్‌హౌజులను ( సముద్రముఒడ్డునఎత్తైన దీపపుస్తంభములను ) కట్టించియున్నారు. ఈదీపములుకొన్ని 20 మైళ్లదూరముకూడ కనబడును. రాత్రులు చీకటిగానున్నపుడు ఓడనడుపువారు తాము ఏరేవునకు సమీపమునందుండునది యీ దీపములమూలమున తెలిసికొనగలరు.

## చెరసాలలు.

పూర్వము చెఱసాలలు ( జెయిలులు ) మిక్కిలి అనారోగ్యకరములుగా నుండెను. ఖైదీలను కుక్కలనక్కలకంటె హీనముగాజూచెడివారు. అనేకమంది జెయిలుయందు మృతిజెందుచుండెడివారు. కావున ఖైదుశిక్షతోడ మరణశిక్షయును వేసినట్లే తలంచెడివారు. ఇక జెయిలునందు ఖైదీలుపడేపాట్లుచూచినచో చావే మేలుగానుండెను. ఆంగ్లేయులప్రభుత్వ మభివృద్ధినొందిన కొలది దేశమునకంతకును గల్గిన అనేకసౌఖ్యములతోపాటు నేరములుచేసినఖైదీలకుకూడ అనేకసౌఖ్యములేర్పడినవి. పూర్వపు జెయిలుకట్టడములనుపడగొట్టించి ఆరోగ్యశాస్త్రసూత్రముల ననుసరించి చక్కనికట్టడములు కట్టియున్నారు. ఈకట్టడములెంతోశుభ్రముగానుండును. పెద్దచెఱసాలలయందు ప్రత్యేకమొకఆస్పిటల్ అసిస్టెంటునేర్పఱిచియుంచెదరు. ఇదిగాక ఊరియందున్న పెద్దడాక్టరు ప్రతిదినము జెయిలుకువెళ్లి చూచిరావలసియున్నది. ఈ కాలమున ఖైదీలకు దేహారోగ్యముతప్పనేని యింటియందుకంటె పదిరెట్లుసౌఖ్యము జెయిలునందు జరుగుచున్నది.

## మ్యూజియములు.

చిత్రవస్తుప్రదర్శనశాలలని మనవారు చెప్పు మ్యూజియములు పెద్దపెద్దపట్టణములందెల్ల కట్టబడియున్నవి. వీనియందున్న చిత్రమైన వస్తువులమాట అటుండ ఈకట్టడములను చూచుటకే వేలకొలదిజనులు పల్లెటూళ్లనుండి వెళ్లుచుందురు. జనులకు జ్ఞానము కలుగుటకును మనస్సునకు సంతోషము కలుగుటకును ప్రభుత్వమువారు ఎన్నో అనుకూలముల నేర్పఱచియున్నారు. విశ్రాంతిదినములయందు మనము మన కుటుంబముతోడ ఈ గొప్పమందిరములకేగి అచ్చటగల చిత్రవస్తుసముదాయమును జూచుచు వినోదించుచు ప్రొద్దుగడపరా వచ్చును.

## హైకోర్టుకట్టడములు.

మ్యూజియములుగాక దేశపరిపాలన కావశ్యకములగు గొప్పగొప్పమందిరములెన్నో ప్రభుత్వమువారు వలసినప్రదేశములందెల్ల కట్టించియున్నారు. (1) హైకోర్టుకట్టడములు (2) సెనెట్‌హాజులు (3) కాలేజీలు (4) ఆఫీసులు (5) కస్టంహౌజులు (6) మార్కెట్టులు (7) వైద్యశాలలు (ఆస్పత్రులు) (8) రెయిలుస్టేషన్లు (9) చర్చిలు (10) బ్యాంకులు మొదలగుకట్టడము లెన్నోగలవు. ఇవికొన్ని, వాని యుపయోగము మాటటుండ, మనమూరక పోయి చూచుటకే యెంతో వినోదకరముగా నుండును. కొన్ని కొన్ని ఆయా పట్టణములకు అలంకారములుగా నున్నవనుటకు సందేహములేదు. మార్కెట్లని నేను చెప్పిన మాటనువిని మనచిన్నయూళ్లలో రోతగానుండి కంపెత్తుచుండు సుజుగుడు కొట్టములని నాయభిప్రాయము కాదు. మహాపట్టణములయందు క్రొత్తగాకట్టిన మార్కెట్లు దివ్యమందిరములుగా నుండును. వానిలోనికి మనము వెళ్లిన త్వరగా ఈవలకువచ్చుటకు మనస్సొప్పకుండును. వానిలో కొన్నిటియందు పున్నమనాటి చంద్రబింబమువలె ఇంపైన వెలుగుతో ప్రకాశించుచుండు విద్యుద్దీపకుండములనుజూచినంజాలును.

## వినోదారామములు.

ప్రజలువిహరించుటకును చూచి యానందించుటకును గొప్ప పట్టణముల యందు చక్కనితోట లేర్పఱుపఁబడియున్నవి. వీనియందు నానాజాతి వృక్షములు కన్నులపండువుగానుండి చలువలు వెదజల్లుచుండును. బోటుషికారులు చేయుట కీతోటలయందు కాలువలుకూడ గలవు. వినోదకరమైన చిన్నచిన్న వంతెనలు, వింతగానుండు చక్కనిగుట్టలు. విచిత్రమైన జలయంత్రములు వీనియందు చాలగలవు.

## దేశసంరక్షణకట్టడములు.

దేశసంరక్షణార్థ మావశ్యకములగు సేనలకు వలయుకట్టడము లెన్నో క్రొత్తగా కట్టబడియున్నవి. పూర్వపుకట్టడములు అనారోగ్యకరములైయుండినందున యుద్ధభటులు విశేషముగా కాలధర్మము నొందుచుండెడివారు. ప్రభుత్వమువారిపుడు ఆరోగ్యప్రదములైన ప్రదేశములయందు విశాలమైన కట్టడములను నిర్మించి అందు సేనలనుంచుటచే ఈకాలమునందు యుద్ధభటులు మిగుల ఆరోగ్యవంతులును దీర్ఘాయుష్మంతులునై యలరారుచున్నారు. ఇది మన దేశమున కెంతక్షేమకరమో ఆలోచింపుడు. సేనావాసములేగాక, ఆయుధాగారములు, తుపాకిమందు కొట్లును కోటలు మున్నగుకట్టడము లనేకములు క్రొత్తగా కట్టబడినవి కలవు.

## పురాతనకట్టడములను సంరక్షించుట, కర్జనుగారుచేసిన గొప్పమేలు.

క్రొత్తకట్టడములను గట్టుటయే గాక పురాతనసుందరములగు [illegible] టయందు మనప్రభుత్వమువా రెంతో శ్రద్ధవహించిరి. ఈసందర్భమున కర్జను ప్రభువుగారుచేసిన మేలును మఱువగూడదు. వీరు [illegible] గూడ చేసిరి.

భాస్కరుడు—నాయనా! పూర్వము మిక్కిలి గొప్పకోటలు కట్టబడుచుండెననియు, లోతైన పెద్దకందకములు త్రవ్వబడుచుండెననియు, నట్టివిప్పుడు లేవనియు జెప్పవిందుముగదా!

రామశర్మ—ఔనౌను! దానికొక గొప్పకారణముగలదు. ఆంగ్లేయప్రభుత్వముపారి ప్రతాపమే, భుజబలమే, బుద్ధిబలమే, పెట్టనికోటలై దేశమును రక్షించుచుండ నీకాలమున కోటలతో పనిలేకున్నది. మనగృహములకు నిజమైన తలుపులు మనప్రభుత్వమువారి శాసనమేగదా. అట్లే మనదేశమునకుచుట్టునుండు గొప్పకోట మనప్రభుత్వమువారి ప్రతాపలక్ష్మియే. "సముద్రమునకు ఇంగ్లండురాణి" యను కీర్తినిగూర్చి ఇంతకుముందె చెప్పియున్నాను. కావున ఆంగ్లేయుల కీర్తియే హిందూదేశమునకు చుట్టునుండు గొప్పకోట. సర్వేశ్వరుని కృపాకటాక్షమూలమున నీదేశ మాంగ్లేయమహాజనులచే సంరక్షింపబడుచుండునంతకాలమును క్రొత్తగా రాతికోటలుగాని మట్టికోటలుగాని కట్టవలసినపనిలేదను సంగతిఁ దెలిసికొనుము.

## 8 వ మేలు పంటకాపులకుగలిగిన సౌఖ్యములు.

ఇండియాదేశముయొక్క లక్ష్మి పంటకాపులలోనున్నది. ఇంగ్లండులోవలెనేగాక యిండియాయందు వ్యవసాయమే ముఖ్యవృత్తిగానున్నది. కావున పంటకాపుయొక్క సౌఖ్యమే దేశముయొక్క సౌఖ్యము. పంటకాపు చెడెనా దేశముచెడినట్లే. కావున ఇండియాయందు ఆంగ్లేయప్రభుత్వమువారి వరిష్ఠభావము పంటకాపులకు వారొనర్చినయుపకారము ననుసరించినదై యుండును. ఇది ముఖ్యవిషయము.

## పంటకాపులకు ప్రభుత్వమువారొనర్చిన గొప్పమేలు.

నీరులేక పంటలుపండక యల్లాడుచుండు కాపులవిచారమును పోగొట్టి చక్కని పంటకాల్వల నమర్చి వానకురువని కాలములలోగూడ పంటపండునట్లుచేసి కాపులను తదితరప్రజలను సుఖులనుగాజేసిన విషయమునుగూర్చియూ

భూమి ఫలవంతమగుటచే అధికఫలము గలుగుటవలననేగాక భూమియొక్క విలువయే యత్యధికమగుటచే పూర్వము పేదవారుగ భావింపబడవలసిన వ్యవసాయదారులిపుడు ధనవంతులైయుండుటనుగూర్చియు మున్నె వివరించితిని.

## స్థిరమైన స్వామ్యపుహక్కు.

రహితునకు భూమియందు స్థిరమైన హక్కుగలిగినది. కావున దానిని ఎంతబాగుచేసి ఎంతఎక్కువ ఫలవంతముగాజేయునో అంతలాభమును తా[illegible] యనుభవించును.

## నిర్ణయమైన పన్నుమొత్తము.

పంటకాపు సర్కారువారికి ఒక నిర్ణయమైన పన్నుమొత్తము చెల్లి[illegible] గాని ఎక్కువపండినందున ఎక్కువసొమ్ము కట్టుటలేదు. పండినపంటను [illegible] వేయుగా సర్కారునౌకరులువచ్చి యూడ్చుకొనిపోవుదురని కాపులు [illegible] దుఃఖింపవలసినకాల మెన్నడో పోయినది. 'ఎంతపండినను అంతే [illegible]' అనుధైర్యము కాపునకుగలుగుట గొప్పమేలు.

## కొద్దిపన్ను మొత్తము.

పూర్వకాలముకంటె ఇపుడు సర్కారువారు [illegible]తో [illegible] మొత్తమును భూమి పన్నుక్రింద దీసికొనుచున్నారనియు, ఇందువలన కాపులకు మిగులున[illegible] దీ కొంచెమే యనియు, ఇందువలన కాపులును, దేశమును దరిద్రదశనొంది [illegible]ష్టించుచున్నారనియు కొందఱు చెప్పుటగలదు. కాపులు ధనవంతులగుచు[illegible] న్నారో దరిద్రులగుచున్నారో ఇంతకుముందు నేను చెప్పినవిషయములనుబట్టి [illegible] కు తెలిసియేయుండును. అటులయుండ సర్కారువారు పూర్వముకంటె భూమిపన్ను అధికముగ దీసికొనుచున్నారా, అల్పముగ దీసికొనుచున్నారా, [illegible]

దియంకెలవలన తెలియును. ఉత్తమాటలతో చెప్పుటవలన ప్రయోజనము కలుగదు.

(1) ఈదేశమును దయతో పరిపాలించుచు దేశక్షేమముకొరకు అనేకవిధముల పాటుపడిన పూర్వపురాజులలో కెల్ల అగ్బరుచక్రవర్తి ముఖ్యుడని మనమందరము ఒప్పుకొనుసంగతేగదా. ఆయనకాలములో కాపులు పొలములో పండిన పంట గరిష్ఠమొత్తములో ( అనగా కర్చులుతీసివేయకుండా అసలు పంటలోనే) నూటికి 33 వంతున భూమిపన్ను చెల్లించెడివారు. గ్రంథస్థమైనఅంకె 33 కాని వాస్తవముగా సర్కారునౌకరులు జమచేయుచువచ్చినది యింతకంటె చాలా ఎక్కువగానెయుండెను.

(2) మహారాష్ట్రపాలకులు నూటికి 50 వంతున జమచేసిరి.

(3) మద్రాసులో బ్రిటిష్ దొరతనమువారికి పూర్వము రాజులు నూటికి 50 వంతున జమచేసిరి.

(4) బంగాళాదేశములో నూటికి 54 వంతున స్వదేశరాజులు పన్ను వసూలుచేయుచుండిరి.

(5) సిక్కుగవర్నమెంటువారు పంజాబులో నూటికి 40 నుండి 50 వంతున కట్టుచువచ్చిరి.

(6) మన బ్రిటిషుదొరతనమువారు సాధారణముగా నూటికి 7, 8 వంతున కట్టుచున్నారు.

(7) బొంబాయిరాజధానిలో స్వదేశసంస్థానములలో బ్రిటిషుదొరతనము వారిపద్ధతిననుసరించి భూములు సర్వేచేసి సెటిల్ మెంటుచేసిరి. వారును సాధారణముగా నూటికి 10, 15 కం తక్కువ పన్ను కట్టుటలేదు. పైఅంకెలను బట్టి దొరతనమువారు పూర్వపు రాజులకంటె భూమిపన్ను తక్కువ కట్టుచున్న ఎంతో తక్కువ కట్టుచున్నది స్పష్టముగాకమానదు. ఆంగ్లేయులు మొట్టమొదట ఈ

ఉత్తరహిందూస్థానమును తమ యేలుబడిలోకితీసికొనినపుడు అనగా 100 సంవత్స
రములక్రిందట స్వదేశరాజులనుచూచి తామును మిక్కిలియెక్కువగానే పన్ను
కట్టుచుండిరి. కాని రానురాను తగ్గించిచేయుచువచ్చిరి. ఇప్పుడు ఆగ్రా, ఔ
డు అను రాష్ట్రములలో గరిష్ఠఫలసాయముమీద నూటికి 7 8 (8 కంటె తక్కువ)
కట్టుచున్నారు.

భాస్కరా! ఆంగ్లేయప్రభుత్వమువారు పూర్వపురాజులకంటె ఎక్కువ
గా పంటకాపులపైని పన్నుకట్టి వారిని దరిద్రులుగా జేయుచున్నారనుమాట
ఎంతదబ్బరో తెలియుచున్నదిగదా.

అగ్బరుయొక్క సిద్ధాంతమిది:—"పొలము సాగుబడిచేయు ప్రతివానికి
ని తిరిగి కోతకోయువరకు వానిజీవనమునకును ([illegible]) వానికుటుంబము బ్ర
తుకుటకును, విత్తనమునకును వానికి ఎంతకావలయునో అంతమాత్రమే వానికి
మిగిల్చియుంచవలయును. తక్కినదంతా భూమిపన్ను. అది సర్కారుఖ
జానాలోచేరిపోవలెను"

ఈసిద్ధాంతముబట్టి వ్యవసాయదారుడు కూలివానితో సమానుడైనాడు.
అంతకంటె హీనుడనిచెప్పవచ్చును, ఏలయన కూలివాడు తనను, తనకుటుం
బమును, పోషించుకొనుచు ఇంక కొంత మిగిల్చుకొనును. అగ్బరుకాలపు పం
టకాపు అట్లుమిగిల్చుకొనుటకు వీలులేదు. ఆరోజుటికి వానిపొట్టకు కావలసినది
మాత్రమే తీసుకోవలెను. తక్కినదంతయు సర్కారుదే.

ఈదేశచరిత్రమునుగూర్చి విశేషముగావ్రాసిన జాన్‌స్టువర్టుమిల్లుగారు ఇట్లని
వ్రాసిరి:—"మిక్కిలి దయాదాక్షిణ్యములుగలప్రభుత్వము అదృష్టాయత్తము
గా ఏలుటతటస్థించినపుడుతప్ప, కాపులనుండి బలవంతముగా రాబట్టబడుచు
న్న ఫలసాయపుపరిమాణమునకు మితియేలేదు. కాపువాడు ఆపైన ఇవ్వలే
నంతవరకుకూడా వానియొద్ద లాగుచునేవచ్చిరి."

దీనినిబట్టి బ్రిటిష్ ప్రభుత్వమువారి కాలములో కాపున కెక్కువ సౌఖ్యము కలిగినది మహమ్మదీయాది రాజుల కాలములో ఎక్కువ సౌఖ్యము కలిగినది వేఱుగ జెప్పనక్కర లేకుండ తెలియక మానదు. ఇప్పుడు మన కాపు, కూలివానికంటె హీనుఁడును కాఁడు, కూలివాడును కాడు. భూమికి యజమానుఁడైయున్నాఁడు. భూమి తనది. పండిన పంటయావత్తు తనసొత్తు. సర్కారువారికి ఎంతో కొంత నిర్ణయమైన పైకపు మొత్తము మాత్రము చెల్లించి వేసి నిశ్చింతగా కూర్చుండును. ఆ మొత్తమైనను ఎక్కువ కాదు, పూర్వ రాజుల కాలమున చెల్లించిన దానిలో సగము లేదు, పాతిక కూడ లేదు. ఇదిగాక మఱియొక సౌకర్యము కలదు. ఏదేనొక కారణముచేత ఒక సంవత్సరము పంట పండక పోయినా అతడు పన్ను చెల్లించవలసినయక్కర లేదు. ఇదియెంత మేలు!

పూర్వ రాజుల కాలములో భూమిపైని వచ్చుచుండిన భూమి పన్ను మొత్తమును, బ్రిటిషు ప్రభుత్వమువారి కాలములో వచ్చుచున్న మొత్తమును పోల్చి చూచినయెడల ఎవరి కాలములో కాపు ఎక్కువ పన్ను చెల్లించుచుండినది స్పష్టము గాను.

(1) 1664-65 వ సంవత్సరములో 26,743,000 సవరనులును

24,056,000 సవరనులును

బెర్నియరు గారి లెక్కప్రకారము 22,593,000 సవరనులు

(2) ఔరంగజేబు కాలములో 38,719,000 ,,

ఇండియా ఆఫీసు లైబ్రరీలోనున్న లెక్కలప్రకారము { 34,187,000 నుండి 34,641,000 వఱకు.

(3) ప్రస్తుతపు కాలములో 17,500,000 సవరనులు మాత్రమే.

ఇట్లు బ్రిటిషు దొరతనమువారు ఔరంగజేబు కాలములో జమచేయబడుచుం

డిన పన్నులోసగముకూడ జమచేయుటలేదు. ఈసగముకూడ ఔరంగజేబు యొక్క రాజ్యవిస్తీర్ణముకంటె ఎంతో ఎక్కువైనరాజ్యములో జమచేయుచున్నారు. ఇప్పటి నీటిపారుదల సాధనాదులమూలమున పండుచున్న పంట ఔరంగజేబుకాలములోనే పండుచుండిన, మనప్రభుత్వమువారు జమచేయుచున్న దానికి నాలుగురెట్లు జమచేసియుండునో ఎనిమిదిరెట్లు జమచేసియుండునో ఏరెఱుంగుదురు. ప్రస్తుతము సర్కారుఉద్యోగస్థులు జమచేయు ప్రతికాసును లెక్కకు వచ్చుచున్నది. సర్కారుబొక్కసములో చేరుచున్నది మహమ్మదీయరాజుల కాలములోనన్నను బొక్కసములోచేరినధనముగాక సుబేదారులు, మంత్రులు, చిల్లరఉద్యోగస్థులు ఎంతో సొమ్ము కాపులయొద్దనుండి గోసుకొనుచుండెడివారు. కాబట్టి ఔరంగజేబుకాలములో 3 కోట్ల87లక్షలసవరనులు సర్కారునకు జమకైనను కాపులు వాస్తవముగా చెల్లించుచుండినది యింతకంటె ఎంతో ఎక్కువ మొత్తమైయుండవలెను. ఒక్క ఔరంగజేబుకాలములో ననేల? ఏకాలములోను ఈకాలమంతతక్కువమొత్తము రాజులు భూమిమీద జమచేసేవారు కారు. మనగ్రంథములలోనైనను రాజు పండినపంటలో 6 వ భాగము అనఁగా నూటికి 16, 17 వంతులు జమచేయవలయుననియున్నది.

“ జనకుడుబోలె నర్మిలి ప్రజం బరికించుచు షష్ఠభాగముం గొనుచును వారిచేతనరి ” అను భారతములోని పద్యమును చూడనగును. ఇది గ్రంథములయందు జెప్పినమాట. వాస్తవముగా నెంతజమయగుచుండెనో గాని మన ప్రభుత్వమువారి హయామునందు దీనిలోసగముకంటె తక్కువే అనగా 8 వంతులకంటెకూడ తక్కువే జమయగుచున్నది. బొంబాయిరాజధానియందు రహితు ఏడున్నరవంతునను, మదరాసురాజధానియందు ఆరుంబావువంతువను ఇచ్చుచున్నాడు. కావున మనగ్రంథములందుచెప్పినట్లు రాజుతాను 1 భాగముతీసికొని వ్యవసాయదారునకు 5 భాగములు విడిచిపెట్టవలసియుండగా మనప్రభుత్వమువారు తాము 1 భాగముతీసికొని వ్యవసాయదారునకు 15 భాగములు విడిచిపెట్టుచున్నారు.

హాంటరుగారు వ్రాసిన సంఖ్యలనుగూడ చూపెదను.

| రాజు పేరు. | సంవత్సరము. | పన్ను మొత్తము. |
|---|---|---|
| అక్బరు. | 1594 | 18,650,000 సవరనులు పెద్దకాసులు |
| ,, | 1605 | 19,430,000 ,, |
| జహాంగీరు. | 1628 | 18,760,000 ,, |
| ,, | ఇంకొక లెక్క ప్రకారము | 19,680,000 ,, |
| షాజహాను. | 1648 | 24,750,000 ,, |
| ,, | 1655 | 30,000,000 ,, |
| ఔరంగజీబు. | 1660 | 25,410,000 ,, |
| ,, | 1666 | 26,700,000 ,, |
| ,, | 1667 | 30,850,000 ,, |
| ,, | తర్వాత | 40,000,000 ,, |
| ,, | 1697 | 43,500,000 ,, |
| ,, | 1707 | 33,950,000 ,, |
| | ఇది ఔరంగజీబు చనిపోయిన సంవత్సరము దేశ మల్లకల్లోలముగానుండినది. | |

అన్ని వస్తువుల క్రింద ఔరంగజేబునకు వచ్చుచుండిన రాబడియావత్తు 1695 వ సంవత్సరమునందు 80,000,000 సవరనులని, 1697 వ సం॥ను 77,500,000 సవరనులని చెప్పఁబడినది. ఇఁక బ్రిటిషు ప్రభుత్వము వారి కాలములో నన్ననో 1869-79 సంవత్సరములలో సగటున సంవత్సరమునకు 35,000,000 సవరనులును 1879-83 సంవత్సరములలో సగటున 40,750,000 సవరనులు మాత్రమే వసూలు చేయబడినది. 1906-07 సంవత్సరములలో సుమారు 72,200,000 సవరనులు వచ్చినవి. ఔరంగజేబు కాలపు దేశస్థితికిని, ఇప్పటి దేశస్థితికిని, అప్పటి వ్యాపార వ్యవహారాదులకును ఇప్పటి వ్యాపార వ్యవహారాదులకును సంబంధమే లేదనియు, అన్ని విషయములలో దేశము ఇబ్బడిముబ్బడిగా అభివృద్ధిపొందినదను సంగతి మనము జ్ఞప్తియందుంచుకొందుమేని పైమొత్తము ఔరంగజేబు కాలపు పన్నుమొత్తముకంటె ఎంత తక్కువో తెలియక మానదు. ఔరంగజేబు కట్టినట్లు పన్ను లిప్పుడు కట్టినయెడల సర్కారువారికి 7 కోట్ల సవరనులకు బదులు 15, లేక 20 కోట్ల సవరనులు రావచ్చును.

### 9 వ మేలు పంటకాపు లేగాక
### దేశజనులెల్లరు ననేకవిధముల నభివృద్ధినొంది
### ధనవంతులగుట.

ఆంగ్లేయ ప్రభుత్వము వారి కాలములో పంటకాపు లేకాక దేశజనులెల్లరు ననేకవిధముల నభివృద్ధిపొంది ధనవంతులైయున్నారు.

భాస్కరుఁడు:— నాయనా! ఈ దేశము రాను రాను ధనహీనమగుచున్నదని ప్రజలు దరిద్రులగుచున్నారని కొందఱు చెప్ప వినుచుందు. మీరు చెప్పినది దీనికి విరుద్ధముగా నున్నదికదా.

రామశర్మ రిత్తమాటలతోడ సంగతులు పన్ని పలుకుట పాడికాదు. వాస్తవస్థితి ప్రత్యక్ష విమర్శవలనఁగాని తెలియరాదు. దినదినము ప్రజలు అభివృద్ధి పొందియున్నదో హీనస్థితిలో నున్నదో ఈ క్రిందిసంగతుల వలన తెలియక మానదు.

## ఉత్తర ప్రత్యుత్తరముల యభివృద్ధి.

జనులు అభివృద్ధిపొందుటకు ఒకసూచన వారిలో ఉత్తర ప్రత్యుత్తరముల యభివృద్ధి. 1856 వ సంవత్సరమున ఉత్తరాదుల రాకపోకలు 36 వేలమైళ్ల దూరము జరుగుచుండెను. ఇప్పుడు 100 వేలమైళ్లదూరము జరుగుచున్నది. 1856 సంవత్సరములో 750 టపా ఆఫీసులుండెను. ఇప్పుడు 70 వేలున్నవి. పూర్వము సంవత్సరమునకు సుమారు 3కోట్లఉత్తరములు మొదలగునవి తీసికొనిపోబడుచుండెను. 1901 వ సంవత్సరమున 53 కోట్లు తీసికొనిపోబడెను. ఇప్పుడు 80 కోట్లకంటె ఎక్కువతీసుకొనిపోబడుచున్నవి.

## సేవింగ్సుబాంకీలు.

సర్కారువారు ఏర్పాటుచేసిన సేవింగ్సుబాంకీలు 8 వేలుగలవు. వీనితో 12 లక్షలమంది 15 కోట్లరూపాయలు దాచుకొనియున్నారు. వీరిలో నూటికి తొంబదిమందికంటె హెచ్చుగానే స్వదేశస్థులుగలరు.

## మణియార్డర్లు.

సంవత్సరమునకు 37కోట్ల 50 లక్షలరూపాయలు మణియార్డర్ల ద్వారా పంపబడుచున్నవి. వెనుకటిసంవత్సరముల లెక్కలనుచూచినయెడల ఈమొత్తములు రానురాను హెచ్చుచున్నవేగాని తగ్గుటలేదు. ఇది దేశము పేదబడుచుండుటకు గుఱుతైనది, భాగ్యవంతమగుచుండుటకు గుఱుతైనది మీరే యోచించుకొనుము. ఇండియాలో జనులు పూర్వముకంటె ఇప్పుడు ఎక్కువగా బంగారు వెండి కూడబెట్టుకొనుచున్నారు. బైటిదేశములనుండి దిగుమతియై యిండియాదేశమువారు కూడబెట్టుకొనిన బంగారు వెండి విలువకడచిన 50 సంవత్సరములలో 630 కోట్ల 30 లక్షలరూపాయలు. కావున సగటున సంవత్సరమునకు 12 కోట్ల 60 లక్షలు చేర్పబడుచున్నది. దీనినిబట్టి యీదేశపుబంగారమంతా రవానా అయిపోవుచున్నదని మనవారు చెప్పుకొనుమాట ఎంతవరకు నిజమో మీరే చూడవచ్చును.

# వర్తకము.

| సంవత్సరము. | దిగుమతిసరకులవిలువ. |
| --- | --- |
| 1858 | 3,42,50,000 సవరనులు. |
| 1868-69 | 3,50,00,000 సవరనులు. |
| 1884-85 | 5,30,00,000 సవరనులు. |
| 1907-08 | 8,65,00,000 సవరనులు. |

| సంవత్సరము | ఎగుమతిసరకుల విలువ |
| --- | --- |
| 1858 | 2,53,00,000 సవరనులు. |
| 1907-08 | 11,55,00,000 ,, |

సముద్రముమీదుగాగాక నేలమీదుగా టిబెటు, చీనా, అఫగనిస్థానము నేపాళము మొదలగు దేశములతో జరుగువ్యాపారము నానాటికి యభివృద్ధియగుచున్నది. 15 సంవత్సరముల క్రిందట 7కోట్లరూపాయల విలువగల్గినది యిప్పుడు 15 కోట్లుఅయినది. ఇండియాకును ఇతర దేశములకును సముద్రమార్గముగాను భూమార్గముగాను జరుగువ్యాపారము కడచిన ఏబదిసంవత్సరములలో అయిదింతలు హెచ్చినది. నేలమీదుగా జరుగువ్యాపారముకంటె సముద్రముమీదుగా జరుగువ్యాపారమే హెచ్చుగానుండును.

1840 వ సంవత్సరములో 2 కోట్ల సవరనుల విలువగల వ్యాపారము జరిగినది.

| | | |
|---|---|---|
| 1857 సంవత్సరము | | 5 కోట్ల 50 లక్షలు |
| 1877 | ,, | 11 కోట్ల 40 లక్షలు |
| 1900-1901 | ,, | 15 కోట్ల 20 లక్షలు |

అనగా 228 కోట్ల రూపాయలవిలువగల వ్యాపారము జరిగినది. దేశము నానాట ధనవంతమగుటకును, అభివృద్ధి పొందుచుండుటకును ఇంతకంటె వేఱునిదర్శనము లేవి కావలెను?

## ఇతరవృత్తులు, వ్యాపారములు.

కొన్ని సంవత్సరములనుండి ఇంగ్లండునుండి దిగుమతియగు వస్త్రముల మొత్తపువిలువతగ్గిపోవుచున్నది. కారణమేమన మనదేశమునందే వస్త్రముల ను విశేషముగా నేయుచున్నారు. మనకుకావలసినబట్టలను మనమే మునుపటి కంటె ఎక్కువగాచేసికొనుటవలన ఇతరదేశములనుండి అవి రావలసినయక్కర తగ్గినది.

## దూదియంత్రశాలలు.

1851 వ సంవత్సరములో దూదియంత్రశాలలు పేరుకైనలేవు. 1877 వ సంవత్సరమునందు నూలువడికెడి కదురులు 13 లక్షలుండినవి. 1901వ సంవత్సరమునందు 192 యంత్రశాలలును 50 లక్షలకదుళ్లును ఏర్పడి పనిచేయుచుండినవి. వానియందు దినమునకు 156,000, మందికి జీవనాధార మేర్పడియుండెను. ఇప్పుడన్ననో 217యంత్రశాలలును 50లక్షలకదుళ్లును గలవు. 2,12,000 మంది పనిచేయుచున్నారు. భాస్కరా! ఇది దేశాభివృద్ధినిసూచించునో దేశదారిద్ర్యదశనుసూచించునో నీవే యోచింపుము. మనదేశములో నేయబడుచుండు వస్త్రములు మనదేశమునందే అమ్మబడుటయగాక జపాను, చీనా మొదలగు ఆసియాఖండమునందు ఇతరదేశములకుకూడ ఎగుమతి యగుచున్నవి.

## జనుపనార యంత్రశాలలు.

బంగాళాదేశమునందు జనుపనారయంత్రశాలలు విశేషముగా పనిచేయుచున్నవి. ఏలూరినం దిట్టియంత్రశాలకలదు. మొత్తముమీద 44 జనుము పడికినేయు యంత్రశాలలుగలవు. ఇవి 25,000 మగ్గములతోడను, 5,20,000 కదుళ్లతోను పనిచేయుచున్నవి. వీనిలో సుమారు లక్ష అరువదియేడువేలమంది జీవనాధారమును పొందియున్నారు. ఉత్తజనుమును, జనుముతో నేసిన సంచులు మున్నగునవియు నానాట ఎక్కువగా ఎగుమతియగుచు వచ్చినది.

## ఇతర యంత్రశాలలు.

ఉత్తరహిందూస్థానమునందు ఉన్నితో బట్టలు విశేషముగా నేయుచున్నారు. కంబళ్లు, శాలువలు, ట్వీడు, ఫ్లానలుగుడ్డలు నేయబడుచున్నవి. ఆల్పాకా మొదలగు నూలు తెప్పించి రాజమండ్రిలోగూడ విలువగలవస్త్రములు నేయుచున్నారు.

యంత్రశాలలేగాక యిటీవల వడివడిగా నిటు నటు తనంతదిరుగులాడు నాడెలు ( దారపుకండెలు ) ( Fly Shuttle ) వాడుకలోనికి వచ్చినవి. స్వదేశవస్త్రనిర్మాణవ్యాపారము అత్యధికముగ నభివృద్ధిఁగాంచినది. ఇప్పుడూరూర మేలైనను సాలెమగ్గములతో నానావిధములైన వస్త్రములను నేయుచున్నారు. జాంపేట చెక్కలు, చీరాలచెక్కలు, పెడనచెక్కలు ప్రసిద్ధికెక్కినవి.

దూదియంత్రశాలలు, జనుముయంత్రశాలలు, ఉన్నియంత్రశాలలేగాక మనదేశమునందు క్రొత్తగా కాగితపుయంత్రశాలలు, గాజుయంత్రశాలలు, కూడ ఎన్నోయేర్పడినవి. ప్రస్తుతము సర్కారుఆఫీసులలో వాడుకయందున్న కాగితములలో సీమలోచేసినవానికంటె మనదేశమున చేసినవేయెక్కువ వాడుకనందున్నవి. ఈవిషయములో సర్కారువారు హిందూదేశాభివృద్ధి నెంతవరకుఁ గోరియున్నారో తెలియును. మోటుగానున్నవని ఘనవారే మనదేశపువస్తు

వులను త్రోసివేయుచున్నారుకాని సర్కారువారు మోటుగానున్ననుసరే స్వదేశవస్తువులనే యెక్కువగా కొనుచున్నారు. సర్కారుఆఫీసులందు లక్కకావలసియుండిన ఏడింతలు స్వదేశపులక్కను ఒకవంతు మాత్రమే విదేశపులక్కను పంపుదురు. ఇట్లు మనవారికన్న సర్కారువారె యెక్కువ దేశోపకారులగుచున్నారు.

వడ్లమరలు మనము చూచుచుండగానే యూరూర ఎన్నెన్ని వెలసినవో మనకు తెలిసినసంగతే. బర్మాయందు బియ్యపుమరలును, రంపపుకోతమరలును ఎన్నోగలవు. వానియందు పనిచేయువారిసంఖ్య నానాట ఎక్కువగుచున్నది. ఈక్రిందిపట్టికవలన మనదేశములో వెలసిన క్రొత్తక్రొత్త వ్యాపారములిట్టివని స్పష్టమగును;—

(1) దూదియంత్రశాలలు.
(2) జనుముయంత్రశాలలు.
(3) ఉన్ని ,,
(4) కాగితపు ,,
(5) గాజు,
(6) ఎముకలపొడిచేయు యంత్రశాలలు.
(7) సిమెంటుసున్నము చేయుశాలలు.
(8) రసాయనవస్తునిర్మాణశాలలు.
(9) లక్కచేయుకర్మశాలలు.
(10) తైలయంత్రశాలలు.
(11) మట్టిపాత్రలుచేయుశాలలు.
(12) పెంకులుచేయుకర్మశాలలు.
(13) చక్కెరచేయు ,,
(14) తోళ్లుచక్కపరచు ,,
(15) వడ్లమరలు

(16) పిండివిసిరెడిమరలు.

(17) పట్టువస్త్రములు నేయు యంత్రశాలలు.

(18) తాళ్లు నేయు కర్మశాలలు.

(19) ఇనుము చక్కబఱచి పోతపోయు కర్మశాలలు.

(20) ఇత్తడిచేయు కర్మశాలలు.

ఇనుపకర్మశాలలయందును ఇత్తడికర్మశాలలయందును 12 వేలమంది పని చేయుచున్నారు. జమల్పూరిలోని యీస్టు ఇండియా రైల్వే కంపెనివారి వర్కుషాపులయందు చేయబడు వస్తువుల విలువ 10 లక్షల 20 వేల రూపాయలనుండి 46 లక్షల 50 వేలవరకు వచ్చినది.

పైచెప్పిన వ్యాపారములేకాక క్రొత్తగా అలూమినియం వ్యాపార మొకటి బయలు దేరినది. రాజమండ్రియందు ఇంటింట నొక కర్మశాల ఉన్నట్లున్నది. మట్టిగురిగెలవలెనే అలూమినియము పాత్రలును ఎక్కువ చూచినను తామె యగునట్లభివృద్ధినొందుచున్నవి. ఈ పాత్రలు మిక్కిలి తేలికగానుండుటచేతను, పులుసు మజ్జిగలు వీనియందుకిలు మూరకపోవుటచేతను వెల రానురాను తగ్గిపోవుచుండుటచేతను భాగ్యవంతులేమి పేదవారేమి యీపాత్రలనే యెక్కువగా వాడుక చేయుచున్నారు. తోళ్లవ్యాపారమునందు క్రోం పదరను వ్యాపారము వచ్చుచున్నది. తోలును ఒకవిధముగా పదును చేసినయెడల నది మిక్కిలి దృఢమైనదగును. ఈ తోలుతో చేసిన చెప్పులు ఉత్త చర్మపుచెప్పులకంటె నాలుగైదు రెట్లు ఎక్కువ కాలము నిలుచును. నీళ్లలో తడిసి యెండినప్పుడు ఎప్పటివలె మెత్తగానుండును గాని పెళుసు కాదు. బాలకులారా! నాకు జ్ఞాపకమున్నంతవఱకు దేశములో నేర్పడుచున్న క్రొత్తక్రొత్త వ్యాపారములను గూర్చి చెప్పినాను. ఇదియంతయు దేశాభివృద్ధికి సూచకమో హీనస్థితికి వచ్చుటకు సూచకమో వాస్తవముగా చెప్పుము చూతము.

ఇతరదేశమునందు మనదేశపు తివాసీలకు, వెండి బంగారు పనులకు, గుడ్డలమీద పూలువేయు పనులకు చాల గిరాకిగలదు. కావున ఆ వ్యాపారములు

కూడ అభివృద్ధిగాంచినవి. రైల్వేలతోసంబంధించినవియు, ఓడలకుసంబంధించినవియు, డి. పి, డబ్ల్యు వారికి సంబంధించినవియు, వర్కుషాపులు గలవు. వీనియందు వందలు వేలకొలది జనులు పని చేయుచున్నారు.

## ముద్రాశాలలు.

మనపెద్దలు కని విని యెఱుగని అచ్చువేయుపద్ధతులు క్రొత్తగా నేర్పడినవి గదా. వీనిలాభములనుగూర్చి ముందుచెప్పెదను. వ్యాపారములో నిదియొక వ్యాపారమగుటచే నిట దీనిని ఉదాహరించితిని. ఈ యంత్రశాలల కొన్నిటియందు వేలకొలదిజనులు పనిచేయుచున్నారు. ఈవ్యాపారమువలన ధనవంతులై దేశోద్ధారకులైనవారు పెక్కండ్రుగలరు. దీనితోపాటు అక్షరములు పోయుయంత్రములును విశేషముగా వాడుకలోనికివచ్చినవి. అనేకులు చక్కని చిత్రములుచెక్కుటయందు తమ తెలివితేటలను చూపుచున్నారు. ఇప్పుడిప్పుడు అచ్చుపడుచున్న చక్కనిపుస్తకములయందు జీవకళ లుట్టిపడునట్లు ముద్రింపఁబడిన చిత్తరువులను జూచినచో ప్రభావతీ ప్రద్యుమ్నమునందలి

"కళకళ నవ్వినట్లు తెలిగన్నుల నిక్కము చూచినట్లతో
బలుకగడంగినట్ల......................," అను పద్య మెవ్వరికైన జ్ఞప్తికి రాకమానదు. భాస్కరా! ఆంగ్లేయప్రభుత్వమువారి కాలమునందు దేశ మెన్నివిధముల యభివృద్ధినొందినది చూచుచున్నావుగదా.

## పట్టణములు. పల్లెలు.

ఇంక నొకనిదర్శనముజూపెదను. ఇప్పుడు మనముచూచుచున్న పట్టణములకును 30, 40 సంవత్సరముల క్రిందటనున్న పట్టణములకును గల తారతమ్యమును విచారించుము. పూర్వము చెన్నపురియందు ముండ్లకంపలతోడను, పెంటకుప్పలతోడను నిండియుండిన సముద్రసమీపప్రదేశమునందిప్పుడు (మన

క్రులు చెప్పునట్లు) ఆకాశమును చుంబించుచున్న దివ్యమైన సౌధము లెన్నో నిర్మింపబడినవి. పూర్వము నక్కలు తిరిగెడి ప్రదేశములలో నిపుడు మోటారు కారులు, బైసికిలు బండ్లు, డబిల్ హార్స్ కోచిలు, ట్రాం బండ్లు తిరుగుచున్నవి. అరవై డెబ్బై సంవత్సరముల వయసుగలవారా పట్టణమునందనేకులుందురుగదా. వారి నెవ్వరినైన వారి చిన్నతనమునందా నగర మెట్లుండినది యిపుడెట్లున్నది చెప్పుమనినచో వారే చెప్పుదురు. చెన్నపట్టణము ఇంకను నెన్నో విధముల యభివృద్ధినొందినది. ఆయా విషయములన్ని ముందు సందర్భోచితముగా వివరించెదను. చెన్నపట్టణమును గుఱించి చెప్పిన సంగతులే ఇండియాయందనేక పట్టణములనుగూర్చి చెప్పవలసియున్నది. బెజవాడ 50 సంవత్సరముల క్రిందట చిన్న కొండపల్లెగానుండెను. అది నానాట నానాట మఱ్ఱివృక్షమువలె నాలుగు ప్రక్కల్లను పెఱిగినది. ఇప్పుడక్కడి కృష్ణానదిపైని కట్టబడిన రేయిలు వంతెనను, ఆనకట్టలను, తూములను, కాలువలను చూచుట కెంతో వినోదకరముగానుండును. పూర్వము సాయంకాలము మనుష్యులు వెళ్లుటకు భయపడుచుండిన ప్రదేశములిపుడు కిట కిట జనముతో నిండియున్నవి. మునుపు పాములు బుసకొట్టుచుండిన తావులలో నిపుడు ఇంజను బండ్లు బుసకొట్టుచున్నవి. బెజవాడ వంటి పట్టణములే గాక చేరువనుండు దుగ్గిరాలవంటి పల్లెటూళ్లుగూడ ఆంగ్లేయ ప్రభుత్వకాలమున దేశము పొందిన యభివృద్ధిని వేనోళ్ల చాటించుచున్నవి. అటవీప్రదేశములు, ఎడారు, లెన్నో నవనవలాడు పచ్చని పైరుతో కన్నులపండువొనర్చు పొలములుగాను, పాడిపంటలతోడ వర్ధిల్లు కాపులతోడ నిండియున్న గ్రామములుగాను మాఱినవి. గ్రామములెన్నో పట్టణములైనవి. ఇన్ని విధముల దేశము అభివృద్ధినొందుట కన్నులకుం గట్టినట్టులు కనబడుచున్నను దేశము హీనస్థితింగాంచుచున్నదని చెప్పుట యెంత పెద్దయబద్ధమో నీవే యాలోచింపుము.

భాస్కరుడు:—నాయనా! మీరు చెప్పినది నిజమే కాని నాకొక సందేహము కలదు. అది నివర్తించినగాని ఆంగ్లేయ ప్రభుత్వము యొక్క సుగుణముల పెంపు ఇంతటిదని పూర్తిగా మనసున నాటదు. కావున నా సందియములను దొలంగించ వేడెద.

రామశర్మ:—పుత్రకా! మనిబూసి నేమేమకాయచేయవలెనని నాయుద్దేశము గాదు. నీకెన్ని సందేహములున్నను జంకక వివరింపుము. నాకు తెలిసినంతవఱకు వానికి సమాధానములను జెప్పెదను.

భాస్కరుడు:— అట్లైన చెప్పెదను. మనదేశము రానురాను ప్రియమగుచున్నదో లేదో! పూర్వము ఒకరూపాయకు 20 సేర్లు 30 సేర్లు బియ్యము అమ్మెడివారు. ఇప్పుడు 10 సేర్లకు మాత్రము ఇయ్యుచున్నారు. పూర్వము 12 అణాలకు వీసెడు నెయ్యి యిచ్చెడివారు. ఇప్పుడు 2 రూపాయలకు కూడ ఈయకున్నారు. ఇట్లే వస్తువులన్నియు ప్రియమైనవి. ఇది ప్రజలకు కష్టము కాదా? పూర్వము 15 రూపాయలతో సుఖముగా జీవనముచేయు కుటుంబమునకిపుడు 30 రూపాయలును చాలకున్నవి. సర్కారువారు పన్నులు ఎక్కువ కట్టడము చేత దేశమంతయు నిట్లు ప్రియమైపోయినదని జనులు చెప్పుకొనుచుండ వింటిని.

రామశర్మ:—భాస్కరా! వస్తువులు ప్రియమైనమాట నిశ్చయమే. కాని యీవిషయమై సర్కారువారిని నిందించుటకు ఆవగింజంతయైనను కారణము లేదు. పన్నులు ఎక్కువగా కట్టుటచేత వస్తువులు ప్రియమైనవనుట యుక్తము గాదు.

## వస్తువులు ప్రియమగుటకుగల కారణములు

## (1) రూపాయ చవుకయగుట.

దీనికి హేతుకారణమును గలదు: ఈ దేశమునందు రూపాయ ముఖ్యమైన నాణ్యముగానున్నది. అనగా ఏవస్తువుయొక్క వెల చెప్పినను ఇన్ని రూపాయలని చెప్పుచుందుము. ఇచ్చిపుచ్చుకోవడము రూపాయలరూపముగా జరుగుచున్నది. పన్నులన్ని రూపాయలుగానేయున్నవి. కాబట్టి యీరూపాయయొక్క చరిత్ర కొంచెము నీవు సావధానచిత్తుడవై గమనించవలసినది. మన దేశములో వలె జెర్మనీ మొదలగు పశ్చిమదేశములలో వెండితోజేసిన నాణ్యములే వ్యాప్తా

దేశములలోనెల్ల వాడుకలో నుండినవి. కాని యున్నట్లుండి ఆ రాజ్యాంగముల వారు వెండిని ప్రామాణిక నాణ్యములుగా వాడుట మానివేసినారు. ఇదిగాక వెండిగనులు ప్రపంచమునందనేక చోట్లకనిపెట్టబడి వెండి త్రవ్వియెత్తబడుచువచ్చెను. కావున వెండి చౌక అయినది. వెండి చౌక అయినకొలది వెండితో చేయబడిన రూపాయకూడా చౌక అయినది. రూపాయ చౌక అయినకొలది దానితో పోల్చిచూచినపుడు రూపాయలు ఇచ్చికొనవలసిన వస్తువులు ప్రియముగుచువచ్చినవి. ఇది మరికొంత స్పష్టముగా వివరించెదను వినుము. ఇపుడు ఒక అణాకు శేరు బియ్యము దొరకుచున్నదనుకొందము. ధాన్యము ఎక్కువగా పండి రెట్టింపు చౌక అయినపుడు ఆ అణాకే రెండుసేర్ల బియ్యము దొరుకునుగదా. కాబట్టి ధాన్యము చౌకగాక మునుపు ఒక శేరు బియ్యపు వెలయును చౌక అయినతరువాత రెండుశేర్ల బియ్యపు వెలయును ఒక్కటే అయినది. కాబట్టి ధాన్యము చౌకగాకమునుపు నాలుగు మామిడిపండ్లకు శేరుబియ్యము ఈయవలసియుంటే చౌక అయినపిదప ఆ నాలుగు పండ్లకే రెండుశేర్ల బియ్యము ఈయవలసియుండును. అట్లే నేడు ఒక్క రూపాయ యొక్క విలువయును అది రెట్టింపు చవుకరైనపుడు రెండురూపాయల విలువయును సమానమగును. కావున నేడు ఒక గంపెడు పండ్లవెల I రూపాయ అయినయెడల రూపాయలు రెట్టింపు చవుక అయినపుడు ఆ గంపెడుపండ్ల వెలయే 2 రూపాయలగును. పండ్లవిలువ యెప్పటివలెనున్నది ప్రియము కాలేదు. రూపాయల వెలమాత్రము మారి అవి చవుక అయినవి. ఇట్లే అన్నివస్తువుల విలువయును ఎప్పటివలె ఉండెనను ఎక్కువ రూపాయలు పెట్టినగాని ఆ వస్తువులు దొరకనందున వస్తువులన్ని ప్రియమైనదనుకొనుచున్నాము. మరియొక చిన్న యుదాహరణమిచ్చెదను. ఒక రాతిబండను ఒక మనుష్యుడు ఎత్తగలడనుకొందము. వాడు జబ్బుపడి సగము బలమే కలవాడగునేని ఆ రాతిబండను ఎత్తగలడా? వానికి తోడు అప్పటికి వానికున్నంత బలము కలవాడు మరియొకడు తోడ్పడవలసివచ్చునుగదా. అయితే రాతిబరువు ఎక్కువైనదా? కాలేదు. అట్లే మన రూపాయ 30, 40 సంవత్సరముల క్రిందట మంచి బలముగలదైయుండెను. ఇప్పుడు దాని బలము సగము తగ్గిపోయినది. కాబట్టి అప్పుడది చేయగలిగినంత పని ఇప్పుడు చేయజాలదు. అందులో సగ

మే చేయును. అంతపనిచేయవలయుననిన ఒకరూపాయకుబదులు రెండురూపాయలు కావలసివచ్చును. వస్తువులవిలువ యెప్పటివలె నున్నది. రూపాయలవిలువ తగ్గిపోయినది. కాబట్టి యిప్పుడు మనము ఎక్కువరూపాయలు ఖర్చుపెట్టవలసివచ్చినది.

భాస్కరుఁడు:—అయిన రూపాయలవిలువ తగ్గకుండ సర్కారువారేల చేయలేదు?

రామశర్మ:—భాస్కరా! మనుష్యజాతియొక్క జ్ఞాన మెక్కువగుచున్నది. శాస్త్రము వృద్ధిపొందుచున్నది. ఖనిజశాస్త్రజ్ఞులు తమ బుద్ధికుశలతచేత క్రొత్తక్రొత్తగనులనుకనిపెట్టి అధికవ్యయముకలుగకుండనే వెండిని త్రవ్వియెత్తి చక్కబఱుచుమార్గములు వాడుకలోనికితెచ్చుచున్నారు. వారిపరిశ్రమచేత మనకు విస్తారము వెండి లభించినది. వెండి చవుకఅయినది. ఒకవస్తువు సులభముగాలభించుటయు, చవుకఅగుటయు తప్పుకాదుగదా. ఇందువలన ప్రజలకు సౌఖ్యమేగాని కష్టమేమున్నది. పైనబియ్యముతో పండ్లనుకొనుటనుగూర్చి చెప్పియున్నాను. ధాన్యము రెట్టింపుపండి సేరుబియ్యముదొరకుట కెంత కష్టపడవలయునో అంతకష్టముతోనే రెండుసేర్లబియ్యము దొరకుచున్నపుడు సేరుబియ్యమునకు బదులు రెండుసేర్లబియ్యమునిచ్చిన నేమికష్టము.

భాస్కరుఁడు:—అయిన మునుపు మనకెంతద్రవ్యము లభించుచున్నదో అంతకుఎక్కువద్రవ్యము ఇపుడు లభించుచున్నదా? వస్తువులు ప్రియమైనందున ప్రజలకు మునుపటికన్న నిపుడు ఎక్కువకష్టములేదా?

రామశర్మ:—కష్ట మెవ్వరికికలదో చూతము. పూర్వము 2 అణాలకూలితో తృప్తినొందుకూలివానికిపుడు 4 అణాలు 5 అణాలు ఇయ్యవలసియున్నది. పూర్వము 1 అణాకు 2 అణాలకు వచ్చు బండివానికిపుడు 2 అణాలును 4 అణాలును లభించుచున్నవి. పూర్వము 20 రూపాయిలువచ్చే వ్యవసాయ

వారునకిపుడు 40, 50 రూపాయిలు లభించుచున్నవి. కావున కూలి వగైరాల విషయములో అతడు రెట్టింపుకర్చు పెట్టవలసియున్నను తనరాబడికూడ రెండింతలుగనుక చింతలేదు. తుదకు బిచ్చగానికికూడ ఎక్కువ రాబడికలదు. పూర్వము దమ్మిడిఇచ్చిన కళ్లనద్దుకొను బిచ్చగానికిపుడు కాని కావలసియున్నది. అట్లే వచ్చుచున్నది. కావున రాజ్యముప్రియమైనందున కష్టమెవ్వరికిని లేదు. ఇండ్లు వాకిళ్లు కలవారికి పూర్వముకంటె ఇపుడు రెండింతలు అద్దెదొరకుచున్నది. తోటలుగలవారికి పండ్లు ఫలముల వెల ఇపుడు రెట్టింపుగానున్నది. కావున ప్రతివారియొక్క సంపాద్యమును రెండింతలగుటచేత వ్యయము రెండింతలైనను చింతలేకున్నది. కావుననే 1877 వ సంవత్సరములో రూపాయకు 9 సేర్లబియ్యముఅమ్మినపుడు పెద్ద కరువుగానుండినదిగాని ఇప్పుడు ష సేర్లు అమ్ముచున్నను ప్రజలకు కరువు ఎక్కువగా నున్నట్లు తోచలేదని గాజిపూరులో నొక మిషనరీ వ్రాసిరి. ఇది మనవారు సాధారణముగా అనుకొనుచున్న మాటయే. రాజ్యము రానురాను ప్రియమగుటచేత సర్కారునౌకర్లకుమాత్రము కొంచెము ఇబ్బంది కలిగియున్నది. కాని ఆవిషయము సర్కారువారికిని వారినౌకరులకును సంబంధించినవిషయమగుటచే ప్రజాసామాన్యమునకు దానితో అంతగా సంబంధములేదు. జీతములుచాలకున్న ఎవరినౌకరులు వారి యజమానుల నడుగుటయు వారు కష్టసుఖములను విచారించి సేవకుల జీతములు హెచ్చుచేయుటయు లోకస్వభావమగు విషయమేగనుక ఈవిషయము దేశమును బాధించునదికాదు.

### వస్తువులు ప్రియమగుటకుగల రెండవకారణము.

### వెలహెచ్చుగలదేశములతోడ సంబంధముకలిగియుండుట.

భాస్కరా! ఇంతవరకు ధరలుహెచ్చుటకు ఒకకారణముచూపితిని. మరియొక కారణముగలదు. ఇండియాలోని రెండుదేశములున్నవనుకొందము. ఒకదేశములో పంటలు హెచ్చుగా పండుటచేత ధాన్యము మిక్కిలిచౌకగానున్నది.

ది. మఱియొక దేశములో పంటభూములు లేకనో మఱియొక కారణముచేతనో ధాన్యము కావలసినదానికంటె తక్కువగా పండుటచేత ధరలు మిక్కిలి హెచ్చుగానున్నదనుకొందము, ఇపుడేమగును. ఆరెండుదేశములకు సంబంధము లేకపోయినయెడ ఎక్కడ పండిన పంటలు అక్కడనేయుండుటచే చౌకగానున్న చోట చౌకగాను ప్రియముగానున్న చోట ప్రియముగానేయుండును. ఒకచోట ధాన్యము మురిగిచెడుచుండ ఒకచోట జనులు ఆకలిచే మాడి మృతిజెందుచుందురు. ఈరెండు దేశములకు రెయిలురోడ్లవలనగాని ఇతరరోడ్లు, కాలువలు మొదలగువాని సంబంధమువలనగాని రాకపోకల కనుకూలము లేర్పడినవనుకొందము. అపుడు ఏమగును వెల తక్కువగానుండి వెల హెచ్చుగానుండు ప్రదేశమునకు ధాన్యము ఎగుమతియగుటచే ( మోతకూలి మినహాయింపగా ) రెండు ప్రదేశముల వెలలును ఒకరీతిగానుండును. అపుడు చౌకగానున్న దేశము ప్రియముగానున్న దేశము చౌకగానైనదనియు మన మనుకొందము. ఇండియాలో ధాన్యము విశేషముగా పండుచు పూర్వము చౌకగానుండిన రాష్ట్రములు ప్రియమగుటకిదియొక కారణము, ఇండియాలో ఆయా రాజధానులకును, ఆయా రాజధానులయందున్న వేలువేలు జిల్లాలకును రెయిలురోడ్లు టెలిగ్రాపులు పోష్టుఆఫీసులు వీనిమూలముగా పరస్పరసన్నిహిత సంబంధ మేర్పడినట్లె ఇండియాదేశమునకును ఖండాంతరములలోని యితరదేశములకును పరస్పరసంబధము కలిగినది. పూర్వము సీమకు వెళ్లవలయుననిన అనేక నెలలు ప్రయాణము చేయవలసియుండెను. సూయెజు కాలువ త్రవ్వినతరువాత 'పదిహేనుదినములలో లండనుపట్టణమునకు పోగలిగియున్నాము. కావున పూర్వముకంటె సీమ మనకిప్పుడు ఎంతో చేరువగానున్నది. ఐరోపాఖండమునకను అమెరికాఖండమునకును మనకును సన్నిహితసంబంధము లేర్పడినవి. ఇట్టిస్థితిగతులయందు ఆ ఖండములందలి దేశములవలె మన దేశమును అభివృద్ధిపొందుటయేగాక అవి మనకంటె ప్రియపురాజ్యములైనయెడల మన రాజ్యమును కొంతవరకైన ప్రియము గాకమానదు. సీమలో సామాన్యమైనకూలివాడు ఇక్కడ పెద్ద యుద్యోగస్థుడు సంపాదించినంత సంపాదించును. కర్చుకూడ అట్లె హెచ్చుగాచేయవలసియుండును. అక్కడ చదువుకొనువిద్యార్థికి నెలకు 150 రూపాయలువ

టినచో ఇక్కడ విద్యార్థికి 15 రూపాయలు చాలుచున్నది. కావున గొప్పవారితోసంబంధము కలిసినట్లు లోకములోని గొప్పగొప్ప రాజ్యములతో మనకు సంబంధము కలిగియున్నందున అన్నియభివృద్ధులతోడ ఆదాయ వ్యయముల వృద్ధియు కలుగక మానదు. భర్తృహరి చెప్పినట్లు నీరక్షీరన్యాయము మనుష్యుల విషయమునే గాక దేశముల విషయమునను చెల్లుచున్నది. ఇంతకుముందు వివరించి చూపినట్లు ఆదాయవ్యయములు జంటగా హెచ్చునగనుక చూచుటకు రాజ్యము ప్రియమైనట్లు తోచినను మునుపులేని క్రొత్తకష్ట మందువలన ప్రజలకు గలుగ నేరదు. కావున రాజ్యము ప్రియమైనదని చింతించవలసినపని లేదు.

## రూపాయ చౌకయగుటవలన సర్కారు వారికిగల్గిన కష్టములు.

దేశము ప్రియమగుటకు కారణము రూపాయ చౌకయగుటయేయని చెప్పియున్నాముగదా. ఇట్లు రూపాయ చవుకయగుటవలన ప్రజల కింతకంతయు కష్టము కలుగలేదుగాని ప్రభుత్వము వారికే కష్టములు కలిగినవి. ఇండియాయందలి ముఖ్యనాణ్యము రూపాయయగుటచేత సర్కారువారి వచ్చుబడియంతయు రూపాయల రూపముగా వచ్చునుగదా. ఈరూపాయల విలువ తక్కువ కాగానే సర్కారువారికి వచ్చుబడియును తక్కువైపోయినది. ఇంగ్లాండునందలి ముఖ్యనాణ్యము సవరను (పెద్దకాసు) దీనివిలువ కొన్ని సంవత్సరములక్రిందట 10 రూపాయలుగానుండినది. అది రాను రాను 15 రూపాయలైనది. కావున సీమలో నెవ్వరికైన 10 కాసు లియ్యవలసియుండిన పూర్వము 100 రూపాయలిచ్చిన సరిపోవునది యిటీవల 150 రూపాయ లియ్యవలసివచ్చినది. ఇది యెంతకష్టమో ఆలోచించుము. 1892-93లో సర్కారువారు సీమలో వడ్డీలక్రింద 1,65,32,000 సవరనులు కర్చుపెట్టవలసియుండెను. దీనిక్రింద వారు 26,47,80,000 రూపాయలు కర్చుపెట్టవలసివచ్చినది. 1873-74 సంవత్సరములలో 17,75,20,000 రూపాయిలే చాలియుండెను. కాబట్టి 8 కోట్ల 70 లక్షల రూపాయల కర్చు వారికి ఎక్కువ తగులుబడి యైనది. ఇట్లే రూ

పాయ వెల ఇంకను తక్కువైపోవుచున్న యెడల సర్కారువారి కెంత చిక్కులుగానుండునో తెలిసినదిగదా. నటి దీర్ఘముగ యోచించి ప్రభుత్వమువారు నవరసునే మన దేశమునకు ముఖ్యనాణ్యముగా నేర్పఱిచి రూపాయకు అణాలు 16 అని నిర్ణయించినట్లు సవరనుకు రూపాయిలు 15గా నిర్ణయించిరి. 1899 వ సంవత్సరములో ఈవిషయమై ఒక ఆక్టు కూడ చేసిరి. 1898 వ సంవత్సరమునుండి 1 రూపాయ 1 షిల్లింగు 4 పెన్సులుగా మాఱుచున్నది. ( పూర్వమీ రూపాయయే 2 షిల్లింగులు 3 పెన్సులుగా మాఱుచుండినది ) ఈవిషయము చాలగలదుగాని ప్రకృతాంశమునకు సన్నిహితసంబంధము లేనందున నిలిపెదను. సార్కారువారు పన్నులు హెచ్చుచేసినందున రాజ్యమంతయు ప్రియమై ప్రజలకు కష్టము గలిగినట్లు నీవు చెప్పినందున నది యెంతయబద్ధమైన నీన్ని చూపుటకును రాజ్యము ప్రియమగుటచే ప్రజలకు కష్టము కలుగలేదుగాని ప్రభుత్వమువారికే కష్టము కలిగినదనియు చూపుటకే నేనింత దూరము ఈవిషయమై చర్చింపవలసివచ్చినది. ఈ దురభిప్రాయము నీకొక్కనికే కాదు. చదువుకొన్నవారికి కూడ చాలమందికి కలదు. కావున వారికి సత్యస్థితి యిట్టిదని మన సంభాషణవలన తెలియునుగాకంచు గోరుచున్నాడను.

భాస్కరుఁడు—నాయనా! నామనస్సులో మఱియొక్క సందేహమున్నది. అదికూడ మీరు నివర్తించెదరేని నిశ్శంకవృత్తితో నుండెదను. ప్రభుత్వమువారు దేశమునకు చేసిన మేలును నిరంతరము నేను స్మరించునాడనైనను రెండు శంకలు నన్నెపుడు బాధించుచుండెను. అందొకటి తీరిపోయినది. మఱియొక శంకమాత్రమున్నది. ఇంతకుముందు మీరు చెప్పినమాటలు దానికి కొంత తోడ్పడుచున్నవి.

రామశర్మ:—ఎట్లెట్లు? వచింపుము! వచింపుము! సందేహము లున్నంతవరకు నేనెన్ని చెప్పినను నీకు సంపూర్ణమైనతృప్తి కలుగనేరదు.

భాస్కరుఁడు:—అయ్యా! మన ప్రభుత్వమువారు ఇండియాదేశపు సొమ్మంతయు దీసికొనివెళ్లి సీమలో చేర్చుచున్నారనియు ఒక్క ద్రవ్యమంతయు

క్కడ చేరుటచే ఈదేశమునందలి ధనము రానురాను దరిద్రులైపోవుచున్నారని నేను ఇది మిక్కిలి హేయమైన అన్యాయమనియు మనవారు కొందరు చెప్పుకొనుచుండ విని అది యెంతవరకు నిజమో మీవలన తెలిసికొనగోరుచుంటిని. ఈదేశము సన్నిధనము ల బాగుచేయ ప్రయత్నించుచున్న ప్రభుత్వమువారు దీనికేల ఆన్యాయమును చేయుదురు?

## ఈదేశముయొక్క ద్రవ్యమంతయు సీమకుఁబోవుటయు, ఈదేశమువారు దరిద్రులగుటయు ఎంతమట్టుకు నిజము.

భాస్కరా! నీవడిగిన విషయమునుగూర్చి నేనిదివరకే వినియున్నాను. యథార్థము తెలియక మనవారు పొందు భ్రమలలో నిదియొకటి. ఈదేశమునుండి సీమకు ద్రవ్యముపోవుటెంత సత్యమో ఆదేశమునుండి ద్రవ్య మీదేశమునకు వచ్చుటయు అంతసత్యమే. వర్తకవ్యాపారములు జరుగు దేశము లొండొంటకెన్నిలావాదేవీలు (ఇచ్చిపుచ్చుకొనడములు) ఉన్నను బంగారుముద్దలుగాని రూపాయల సంచులుగాని రవాణా చేయరు. హుండీల మూలముగా పద్దులు జమకట్టుకొందురు. వీరు వారికి వారు వీరికి ఈయవలసిన పద్దులు జమాకర్చులు కొట్టివేయగా బాకీ ఇంతయని ఆరునెలలకో సంవత్సరమునకో తేల్చుచుందురు గాని బంగారు వెండికడ్డీలు పంపరు. ఈదేశపు బంగారమంతయు బంగారుముద్దగా సీమలో వెళ్లి పేరుచున్నదని పామరులు తలంచుచుందురుగాని అట్లెన్నడు జరుగుటలేదని ముందువారు తెలిసికొనవలెను. పోనీ ఆదేశమునకు ఈదేశమునకు జమాకర్చులెక్కలు చూడగా తుదకు బాకీ యెవరిమీద తేలుచున్నది ఎవరు ఎక్కువ ద్రవ్యము నీయవలసివచ్చుచున్నది; అను విషయమును విచారింతము. 1875-1879 వ సంవత్సరములలో సంవత్సరమునకు ఈదేశపు దిగుమతిసరకులకంటె 2 కోట్ల 10 లక్షలవరసుల వెలచేయు సరకు ఎక్కువ ఎగుమతి చేయబడెనట. కాబట్టి బాకీలు తేల్చగా సైకము ఈదేశమునుండి యితరదేశములకు వెళ్లుటకు బదులు 2 కోట్ల 10 లక్షలవరసులు ఇతరదేశములనుండి ఈదేశమునకే రావలసివచ్చినవి. ఈ 2 కోట్ల 10 లక్షలలో 70 లక్షలు వడ్డీ

క్రిందచెల్లింపవలసియుండినది. 70 లక్షలు ఇండియానిమిత్తము సీమలో చేయు కర్చులక్రింద చెల్లింపవలసివచ్చినది. ఇదిపోగా ఇండియాదేశమునకు నికరము 70 లక్షలు నవరసులు సంవత్సరము సంవత్సరముమనదేశములో మిగులుచు వచ్చినది. ఇది 30, 35 సంవత్సరములక్రిందటిమాట. ప్రస్తుపులెక్కలనువిచారింతము.

| | | |
|---|---|---|
| 1907-08 వ సంవత్సరమున ఎగుమతులవిలువ | 11,55,00,000 | నవరసులు |
| దిగుమతులవిలువ | 8,65,00,000 | ,, |
| కావున జమాకర్చులు తేల్చినపుడు ఇతరదేశముల నుండి మనదేశమునకు రావలసిన పైకము మొత్తం | 2,90,00,000 | ,, |
| ఇప్పుడు ఇండియాగవర్నమెంటువారు ఎడ్జీక్రింద నైతేనేమి ఇండియానిమిత్తము ఇంగ్లాండులో చేయు కర్చులక్రింద నైతేనేమి చెల్లించుమొత్తము. | 1,80,000,000 | ,, |
| ఇది తీసివేయగా మనకు సంవత్సరమునకు నిలువ పెచ్చు. | 1,10,000,000 | ,, |

ఇట్లు సంవత్సరము సంవత్సరమును ఇతరదేశములనుండి మనదేశమునకు 1 కోటి 10 లక్షలనవరసులు అనగా 16 కోట్ల 50 లక్షలరూపాయలు వంచవలసినట్లేర్పడుచుండగా మనదేశమునుండే బంగారుముద్దలన్నియును పోవుచున్నవనియును నానురాను మనదేశము దారిద్ర్యదశ నొందుచున్నదనుట యెంతసత్యమో నీవే యోచించుకొనుము.

భాస్కరుడు:—మీరుచెప్పినట్లు 1 కోటి 10 లక్షలనవరసులు ద్రవ్యము సీమలో మనము చెల్లించుచున్నాముగదా. ఇంతద్రవ్యమును మన కేయుండిన నెంతమేలు.

రామశర్మ:—భాస్కరా! అంగడిలో నీవు కాణీయిచ్చి ఒకవస్తువు కొంటివనుకో. ఆ కాణి అంగడివానికి న్యాయముగానిచ్చినదా? అన్యాయముగా నిచ్చినదా? నీవు ఒక షాహుకారు దగ్గిర 100 రూపాయలు అప్పుతెచ్చుకొని నెలకు మనవారిప్పుడు పుచ్చుకొనే రూపాయయుగాక తుదకు అర్థరూపాయయుగాక 7 అణాలు వడ్డీయిచ్చెదవనుకో. ఇది న్యాయమా అన్యాయమా? మన మొకరికి సొమ్మిచ్చినంతమాత్రముచేతనే అది అన్యాయముగా ఇచ్చినట్లగునా? ప్రతిఫలము పొందకుండ నిష్కారణముగా మనమొక కాసు ఇయ్యవలసియున్నను అది అన్యాయమేయగును. కావున పైజెప్పిన 1 కోటి 80 లక్షల నవరసుల్ను ఏయేపద్దులక్రింద మనము చెల్లించుచున్నది విచారింతము.

(1) పూర్వము ఈదేశము అడవులతోను ఎడారులతోడను నిండియుండి రాకపోకలకు ఎన్నో కష్టములు సంభవించుచుండినపుడు మనప్రభుత్వమువారు అడవులనుగొట్టి, మార్గములను చక్కబరిచి, రెయిళ్లనుచేసి, వంతెనలనుగట్టి, ఆనకట్టలను నిర్మించి కాలువలనుత్రవ్వి దేశమంతయు సుఖస్థితికిదెచ్చిరనియు ఈకార్యమునకు అనేకకోట్లద్రవ్యము ఖర్చుపెట్టవలసివచ్చినపుడు ఆంగ్లేయమహాజనులే ముందుకువచ్చి తమపెట్టెలనుతెఱచి సంచులనువిప్పి కోట్లుకోట్లు మనదేశమునందు క్రుమ్మరించిరనియు మనమెఱుగుదుముగదా. ఆకాలమునందు ఇంతగొప్పమొత్తము అప్పుఇచ్చినదే గొప్పసంగతి. అట్లు అప్పుఇచ్చి మనకెంతోయుపకారులైనవారికి వారు పెట్టుబడిపెట్టినపైకముమీద వడ్డీ యియ్యడము అన్యాయమా? పోనీ ఆవడ్డీయైన హెచ్చుగానుండిన మనము చింతింపవచ్చును. అంత తక్కువవడ్డీకి, ఇతర దూరదేశములమాట అటుండనిచ్చి, మనదేశములోనే మనకెవ్వరైన నిచ్చువారున్నారేమో ఆలోచింతము. 1879 వ సంవత్సరాంతమువఱకు మనకు రెయిలునేలక్రింద పెట్టుబడిపెట్టినమొత్తము 12కోట్ల నవరసులు. మనవారికిష్టమున్నయెడల వారిబాకీ వారికిచ్చివేసి ఆవడ్డిని వారికి చెల్లించకుండ మనమే యనుభవింపవచ్చునుగదా. ఇంతగొప్ప అప్పుమొత్తమును మనవారు తీర్చగలిగినను కూడ అట్లుచేయుటకు ఒప్పుకొనరు. ఏలయన నూటికి 1 రూపాయి, 12 అణాలువడ్డీ పుచ్చుకొనెడివారని 7 అణాలు పుచ్చ

కోమనిన నెట్లొప్పుకొందురు. ఆంగ్లేయులు మనకు అప్పుఇచ్చినందున రెయిలు వేలు మొదలగు ఖానిఘూలమున మనవారు పొందుచున్న గొప్పల్లాభముల మాట అటుండ మిక్కిలి తక్కువవడ్డీవకె అప్పుదొరికినందున 1879 సంవత్సరమున మనము చెల్లించిన 70 లక్షలనవరసులు దేశమునకు నష్టము కాలేదు నరేకదా ఎదురు 70 లక్షలనవరసులు ఆంగ్లేయులవలన మనమే లాభమును పొందినవారమైతిమి. ఏలయన ఆంగ్లేయులు పెట్టుబడిపెట్టిన పైకపుమొత్తమునకు మన షావుకార్ల వడ్డీప్రకారము చూచినయెడల అప్పుఇచ్చిన 70 లక్షలకుబదులు 140 లక్షలో అంతకంటె కూడ ఎక్కువో వడ్డీ యియ్యవలసియుండును.

(2) ఈదేశములో దొరుకని కొన్ని వస్తువులను సీమనుంచి తెప్పించుచున్నారు. ఈవస్తువులనే యిండియాయందు చేయువలయునసిన చాల ఎక్కువ కర్చు తగులుబడియగును. సీమలో కొనినవస్తువులకు సొమ్ము చెల్లించుటయందేమి యన్యాయమున్నది.

(3) ఇండియాయందలి బ్రిటిషు సైన్యముకొఱకు ఇంగ్లాండులో కొంతసైకము వెచ్చము చేయబడుచున్నది. దేశసంరక్షణార్థము సైన్యమావశ్యకముగనుక ఆ సైన్యపోషణార్థము సొమ్ము కర్చుపెట్టుటయును ఆవశ్యకమే.

(4) రిటైరయిన సర్కారుఉద్యోగస్థులకును సోల్జర్లకును పెన్షన్లు ఇచ్చుచున్నారు. ఇది మరియొక పద్దు. తమవయసంతయు ఈదేశములో గడపి జాగరూకతతో పనిచేసిన నౌకర్లకు వృద్ధదశలో ఉపకారవేతనమిచ్చి కాపాడుట తప్పా? ఇండియాదేశస్థులగు ఉద్యోగస్థుల కెట్లు పెన్షన్లను ఇచ్చుచున్నారో ఆట్లె ఆంగ్లేయులగు ఉద్యోగస్థులకును ఇచ్చుచున్నారు. వారుఇంగ్లండులో కాపురమున్నందున ఇంగ్లండులో నిచ్చుచున్నారు. గాని, యిండియాలోనే వారు కాపురమున్నచో ఇక్కడ నేయిత్తురు. ఎక్కడఇచ్చిననేమి? ఇచ్చుట న్యాయమేకదా?

(5) ఇక్కడనున్న ఉద్యోగస్థుల జీతములకొఱకు కొంతసొమ్ము వెచ్చబడుచున్నది. పనిచేసిన వారికి జీతములిచ్చుట అన్యాయము కాదుగదా.

(6) మన చక్రవర్తిగారికి యిండియా దేశ పరిపాలననిమిత్తము ఒక మంత్రికలడు. ఈమంత్రినే సెక్రెటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాఅందురు. ఈమంత్రికిని వీరి ఆఫీసు ఉద్యోగస్థులకును ఇండియాగవర్నమెంటువారే జీతములనిచ్చెదరు. రాజునకు మంత్రియుండుటయు మంత్రికి జీతమిచ్చుటయు సహజమే కాని యింత అనవసరముగాగాని అన్యాయముగాగాని చేసిన వ్యయమె. ద్దని పైనచూపినట్లు ఇండియాసొమ్ము ఇంగ్లండులో కర్చుపెట్టుట సత్యమేయైనను ఆసొమ్ము అవసరమైనట్టియు న్యాయమైనట్టియు కార్యములనిమిత్తము కర్చుపెట్టబడుచున్నదే కాని అనవసరమైనట్టి కాని అన్యాయమైనట్టి కాని కర్చు ఇందుకయు లేదు. ఇండియాగవర్నమెంటువారు తాముచేయుచున్న కర్చు లెప్పటికప్పుడు విమర్శించుచు తగ్గించవలసినవి తగ్గించుచునేయుందురు. కాని వృథాగా వ్యయము సేయరు.

## 10 వ మేలు. పంటల యభివృద్ధివిషయమై చేసినపనులు.

ఇండియా దేశమున విశేషముగా వ్యవసాయము అభివృద్ధినొందునిమిత్తము సర్కారువారెన్నో ప్రయత్నములుచేసిరి. వ్యవసాయవిచారణనిమిత్తమొక డిపార్టుమెంటు నేర్పరచిరి. ఈదేశములో పూర్వములేని క్రొత్తమొక్కలను చెట్లను దెచ్చి యిక్కడ అభివృద్ధినొందునట్లుచేసిరి. తేయాకు, కాఫీ, ఉర్లగడ్డలు, అనేక కాయకూరదినుసులు పూర్వ మీ దేశమున పండుటలేదు. తేయాకు. కాఫీ పైర్లవలన దేశమునకెంతో లాభము కలుగుచున్నది. 1907 వ సంవత్సరమున 5 లక్షల 36 వేల యకరములకంటె ఎక్కువప్రదేశమునందే తేయాకుపైరు చేయబడుచుండెను. ఈతోటలవలన 5 లక్షలమంది జీవించుచున్నారు. ఆసంవత్సరమున 10 కోట్ల 30 లక్షలరూపాయలవిలువగల తేయాకు ఈ దేశమునుండి ఎగుమతిచేయబడినది. 1 కోటి 11 లక్షల 50 వేల రూపాయల వెలగల కాఫీకూడ ఎగుమతిచేయబడినది. జనుముపంటకూడ అభివృద్ధినొందినది. 1907 వ సంవత్సరములో 36 కోట్ల 50 లక్షలరూపాయలవిలువగల జనుమును జనుపనార మొదలగునవియును ఎగుమతి చేయబడినవి. కావున సా

మూరు 48 కోట్ల రూపాయలధరగల కాఫీ, తేయాకు, జనుము ఎగుమతియైనవి 858 వ సంవత్సరములోనన్నో 75 లక్షల విలువగలవే యెగుమతియయ్యెను. ఈ 50 సంవత్సరములలో ఈమూడుపంటలు 50 రెట్లు ఎక్కువైనవి. 1858 వ సంవత్సరమున బ్రెజీలు దేశమునుండి చింకోనాచెట్టును తెచ్చి యీదేశమున నాటిరి. ఇప్పుడది పర్వతప్రదేశములయందు పెంచబడుచున్నది. దీనివలన జ్వరమునకు మంచిమందుగా ఉపయోగించుచున్న క్వయినాపొడుము చేయబడుచున్నది. మిక్కిలి యుపయుక్తమగు నీచెట్టును మనదేశములో పెంచుటచే క్వయినామందు మిగుల చౌకఅయినది. క్రొత్తచెట్లను పైరులను పండించు విషయముననేగాక యిదివఱకు ఈదేశములోనున్న పైరులను అభివృద్ధిచేయు విషయమున కాపులకు తెలియనిసంగతులను నేర్పుచు మంచివిత్తనములను తెప్పించియిచ్చుచు మాదిరిపొలములను సాగుబడిచేయించి చూపుచు బీదలకు చికిత్సలను కనిపెట్టి తెలుపుచు, విద్యార్థులకు వ్యవసాయశాస్త్రమును బోధించుటకు కళాశాలల నేర్పఱచుచు ఇట్లనేకవిధముల వ్యవసాయదారులకు సర్కారువారు తోడ్పడుచున్నారు.

## పశుచికిత్సాశాలలు:

ఇంతియగాక పశువులరోగములను వానికిచేయనగు చికిత్సలను వివరించి ప్రకటించుచు, పశువైద్యమునునేర్పి కొందరిని గ్రామాంతరములకుబంపి అచటచట పశువైద్యశాలలనమర్చి నోరులేని జంతువులనొప్పిని తీర్చుపుణ్యము కట్టుకొనుటయేగాక, పశువుల సంపదగా తలంచు కాపువానికి ప్రభుత్వమువారు తోడ్పడుచున్నారు.

## క్రొత్తచెట్లను పెంచుటకు తోటలును,
## నానావస్తు ప్రదర్శనశాలలును

ఇండియాదేశపు ఓషధులు నశించకుండుటకును క్రొత్తక్రొత్తచెట్లు పెంచబడుటకును, సర్కారువారిచే సంరక్షింపబడు తోటలుగలవు. వీనిని దర్శించి

నప్రజలకు వృక్షశాస్త్రజ్ఞానము కొంతవఱకైనకలుగును. ఇవిగాక నానావస్తువర్గమును, జంతువులను తెప్పించి మ్యూజియములలో జాగ్రత్తపఱచియుంచి జనులకు ప్రపంచజ్ఞానము అధికముగ కలుగునట్లుచేయుచున్నారు. మన దేశపువస్తువులు సీమలోని మ్యూజియములలో కూడబెట్టియుంచియున్నారు. యీమ్యూజియములను ఎవ్వరైనను వెళ్లి చూడవచ్చును.

## పరపతి.

అప్పుకావలసిన వ్యవసాయదారులు దురాశగల షాహుకారుచేతులలో జిక్కి చెడకుండ అగ్రికల్చరల్ బాంకులనుబెట్టి పరపతిసంఘము లేర్పడుటకు ప్రోత్సాహము కలుగజేసి సర్కారువారు కాపునకు పలుతీరుల తోడ్పడుచున్నారు.

## 11 వ మేలు ఆయురారోగ్యములు.

ఆంగ్లేయప్రభుత్వకాలములో జనులు ఆరోగ్యభాగ్యమును బడయుటకు ఎన్నోప్రయత్నములు చేయబడినవి. పూర్వము కలకత్తానగరము కుళ్లి కంపెత్తు పెంటకుప్పలతోనిండిన మురుగుడుగుంటలకు నెలవైయుండెను. పట్టణపురోతయిట్లు మురికిగుంటలలోగాని హుగ్లీనదిలోగాని పారవేయుచుండెడివారు. ఊరిపెంటతో నింపబడుచుంటయేగాక ఊరిలోచచ్చినవారి శవములన్ని పారవేయబడుచుండుటచే ఈనది యెంతచక్కగానుండియుండవచ్చునో, ఇట్టిజలమును త్రాగుచుండుజను లెట్లుండవలయునో వేఱుగ జెప్పనక్కరలేదు. చూచుట కసహ్యముగాను ఉండుటకనారోగ్యముగాను నుండిన కలకత్తానగరములో ఈకాలమున పోల్చుటకు ఐరోపాలోకూడ ఎన్నోపట్టణములు లేవు. కలకత్తాయొక్క అందమును చూచి దానికి రాజనగరుల పట్టణమని బిరుదునామమును పెట్టిరి.

1864 వ సంవత్సరము లక్షప్రజలుండిన రంగూనుపట్టణములో సరాకురుషారిదీపము ఒక్కటైననుండినది కాదు. నిర్మలమైన జలము త్రాగుటకు లభించెడిదికాదు. మురుసనీరు వీథులయందే పాఱుచుండెను. పట్టణములోని

పొంటు ఎక్కడిదక్కడ కుళ్లి కంపెత్తుచుండవలసినదేగాని దానిని తొలగించు మార్గము లేదు. అప్పటి రంగూను నకును ఇప్పటి రంగూను నకును ఎంతో తారతమ్యము గలదు గదా. కలకత్తా రంగూను పట్టణములను గురించి చెప్పిన సంగతులే చెన్నపురి మొదలగు పెక్కు పట్టణములను గురించి చెప్పవలసియున్నది. త్రాగుటకు నిర్మలజలము దొరుకనందున జనులు పెక్కు దీర్ఘవ్యాధులకు పాల్పడుచుండిరి. ఇప్పుడు పట్టణములకు చేరని దూరప్రదేశములందు స్వచ్ఛమైన జలము సేకరించి అక్కడనుండి నీళ్లు చెడకుండ పట్టణములలోకి తెచ్చి గొట్టముల మూలమున మన కొసంగుచున్నారు. విశాఖపట్టణము, గుంటూరు, బెజవాడ కాకినాడ మొదలగు పట్టణము లిందుకు నిదర్శనముగానున్నవి. పట్టణములు పరిశుభ్రముగానుండుటకును పరిశుభ్రమైన జలము మనకు లభించుటకును తగిన యేర్పాటులు చేసినదేగాక ప్రజల ఆరోగ్యవిచారణను చేయుచు నెల్లపుడు కనిపెట్టి చూచుటకు శానిటరీ యినస్పెక్టర్లను సూపరింటెండెంట్లను, కమిషనర్లను ఏర్పరచియున్నారు.

## ఆస్పత్రిలు, డిస్పెన్సరీలు.

ఇట్లు వ్యాధులు రాకుండ జనులు ఆరోగ్యవంతులై యుండుటకు వలయు జాగ్రత్తలు ముందుగా పుచ్చుకొనుటయేగాక వ్యాధివచ్చినతరువాత అది నివర్తించుటకును ఎన్నో యేర్పాట్లుచేసియున్నారు. ఈ కాలమున కొంచెము పెద్దయూళ్లకన్నిటికి ఆస్పత్రులును (రోగులనుంచుకొని చికిత్సచేయు శాలలును) డిస్పెన్సరీలును (మందులిచ్చి పంపుశాలలును) ఏర్పరుపబడియున్నవి.

1857 వ సంవత్సరమున 142 సివిలు ఆస్పత్రులుండెను. వానిలో ఆయేడు 6,71,000 మంది చికిత్సనందిరి.

1907 వ సంవత్సరమునందన్నో 2,514 ఆస్పత్రులుండెను. వానిలో 2,50,00,000 మంది చికిత్సనందిరి.

దీనినిబట్టి సర్కారువారు వారిప్రజలవిషయమై ఎంతశ్రద్ధపుచ్చుకొనుచున్నది స్పష్టమగును. ఇన్ని వైద్యశాలలు, నిందరు రాజులచే ప్రజలకొఱకే

ర్పఱుపబడిన వైద్యులు, ఇండియాలో నీకాలమునను నెంతదయాపూర్వకముగ రాజ్య మేలినవుడును లేనసంగతి మనకు తెలిసినదేగదా.

## వైద్యశాస్త్రమును చక్కగా తెలిసిన వైద్యులు.

వైద్యశాలలున్నంతమాత్రమున చాలదు. దేశములో వైద్యశాస్త్రమును చక్కగా తెలిసికొని అనుభవసిద్ధముగా వ్యాధులకు స్వస్థమును నానికిజేయునట్టి చికిత్సయును నేర్చినవైద్యులెందరో కావలసియున్నారు. కావున నీశాస్త్రమును నేర్చుకొనుటకు ప్రభుత్వమువారు విద్యార్థులను తరిబీయతు చేయుటకు వైద్యకళాశాలల నేర్పఱచియున్నారు. వీనిలో పురుషులకే గాక స్త్రీలకునుండి వైద్యమును నేర్పుచున్నారు. 1857 వ సంవత్సరమునందుండిన వారికంటె ఇప్పుడు 50 యింతలకు ఎక్కువగా సర్టిఫికేట్లుపొందిన వైద్యులున్నారు.

## జనసంఖ్య రానురాను అధికమవుట.

ప్రభుత్వమువారు తమప్రజల ఆయురారోగ్యవిషయమున నింతశ్రద్ధవహించి వారిని సుఖులనుగాజేసిన కారణమున వారిసంఖ్య నానాట అభివృద్ధి నొందుచూ వచ్చినది. 1872 వ సంవత్సరమునందున్నవారికంటె 1881 వ సంవత్సరములో 1 కోటి 50 లక్షల 50 వేలమంది ఎక్కువైరి.

1881 నుండి 1891 వఱకు లెక్కచూడగా 2 కోట్ల 70 లక్షల 70 వేల మంది ఎక్కువైరి. ఒక్క లోయరుబర్మాలోనే నూటికి 25 మందివంతున జనసంఖ్య హెచ్చినది.

1891 వ సంవత్సరములో 12,30,00,000 పురుషులును, 11,80,00,000 స్త్రీలు నుండిరి.

గంగానదిపాఱుచున్న దేశములయందు సంవత్సరమునకు 1000 కి 5 గురు ఎక్కువగుచున్నారు; బర్మాలో వేయింటికి 40 మంది ఎక్కువగుచున్నారు ఉత్తరబీహారులో మరింత జనసంఖ్య హెచ్చినది.

## పూర్వము జనసంఖ్య ఎక్కువకాకుండుటకు కారణము,

పూర్వము విశేషముగా యుద్ధములు జరుగుచుండినవి. రాజులసేన లొండొంటితో పోట్లాడి నశించుచుండ అవి గ్రామములపై వేలకొలది జనులను నరికి పొడిచి కాల్చి చంపుచుండెడివి. ఒక్కొక్కసారి గ్రామములను గ్రామములనే తగులబెట్టిపోవుచుండెడివి. ఇక మరాటీదండ్లు, పిండారీగుంపులు, తగ్గులనే హత్యచేయువారు జనులను పెట్టుచుండిన బాధలకుమితిలేకుండెను. దినమొక గండముగా గుండెదిగులు ప్రాణతల్లటతో నల్లాడుచుండినజనులు అభివృద్ధి నొందుట యెట్లుపొసగును. ఇప్పుడన్ననో శత్రురాజుల భయమును లేదు, మునుపటి బందిపోటుదొంగల బాధయును లేదు.

(2) క్షామబాధ పూర్వమధికముగానుండెను. పండిన దేశములనుండి సులభముగా పండని దేశములకు ధాన్యము రవాణాయగుటకు మార్గము లేనందున కరవుబాధచే తినుటకన్నములేక జను లెందఱో మృతిజెందుచుండెడివారు. ఇప్పు డట్టియిక్కట్లు నీటిపారుదల సాధనములవలనను రెయిలువేలు రస్తాల మూలముననుతొలగినది.

(3) రోగములుతగ్గి జనులకు ఆరోగ్యభాగ్యము అధికముగా లభించినది. పూర్వము పట్టణములుండిన దుస్థితిని వివరించితినిగదా. నా చేతిమాత్ర వైకుంఠయాత్ర అను సంచికట్టువైద్యులు పూర్వమెందఱో యుండిరి. ఇవన్నియు మరణములసంఖ్య హెచ్చుటకు కారణములుగదా,

(4) పూర్వము కొన్నిజాతులలో స్త్రీశిశువులను పురిటియందే చంపుచుండెడివారు. చనిపోయిన భర్తతోడ భార్యను కాల్చి చంపుచుండెడివారు గంగాదేవివలె కన్నబిడ్డలను గంగయందు పారవేయుచుండెడివారు. ఇవియన్నియు చల్లని బ్రిటిషుప్రభుత్వమువారి శాసనమువలన తొలగినవి. కావున జనసంఖ్య వృద్ధినొందినది. ( కాని యిట్లు జనసంఖ్య అమితముగా హెచ్చుటవలన కొంతకాలమైనపిదపనైనం గొంతవరకు దేశమునకు ఇబ్బందికలుగవ

ప్పను గాన, ప్రజలు బాల్యవివాహములు మాని, ఏకపత్నీవ్రతస్థులై నియమపూర్వకముగ సత్కర్మాచరణపరులై కేవలవిషయలోలురుగాక సుఖజీవనము గడుపుదురుగాక.)

## 12 వ మేలు బహిరంగమైనచట్టము లేర్పడుట.

ఇదిమంచి యిదిచెడ్డయని స్పష్టముగా వివరించుచు నేరములు ఇట్టివి బాధ్యతలిట్టివి అనివివరముగా తెలియజేయు చట్టములు సర్వులకు తెలియబడు యు, అవి చిదంబరరహస్యముగా ఎవరికో అధికారులకు కొందరికి మాత్రము తెలిసియుండునట్లు దాచియుంచక జనసామాన్యమునకు విస్పష్టముగా తెలియునట్లు దేశభాషలయందుకూడ ప్రకటింపబడునట్లు సర్కారువారు చేసినది యీదేశమున కొక గొప్పమేలు. లార్డ్ మెకాలేగారు ఇండియన్ పీనలుకోడును (శిక్షాస్మృతిని) వ్రాసిరి. ఈచట్టములో పోల్చదగిన చక్కని శిక్షాస్మృతి ప్రపంచము లోలేదనిచెప్పుదురు. క్రిమినల్ ప్రొసీజరుకోడుకూడ అట్టిదే. ఇంతటి వివరముగాను ఇన్నిసంగతులు ఇమిడియుండు ఇంతస్పష్టముగాను వ్రాసినట్టి చట్టము లెందును నుండవు. ఇట్టి చట్టములను ఏర్పరచుటకు సర్కారువారు కమిషన్లను (సభలను) నియమించి శ్రేష్ఠమైనశాసనములచే దేశమును పరిపాలించుచుండుట మిగుల కొనియాడదగినవిషయమైయున్నది. ఈ ఘనమైన శాసనముల వలన నేరములు చాల తగ్గినవి. జాతి మతభేదముల నెంచక యెవరియు పాటింపక శ్రీరాజుగారిప్రజలలో బిచ్చగాడైనను జమీందారైనను ఏకరీతిగా బద్ధులైయుండునట్లుచేసిన యీశాసనముల సర్వసమత్వభావము మిగులయు మెచ్చదగియున్నది.

క్రిమినల్ చట్టములవలె సివిల్ చట్టములును ఏర్పరుపబడెనని కాని యివి అంతతేటగాలేవు. అనేక శ్రుతి స్మృతులను పరిశీలించి మనువంటి పండితులు హిందూన్యాయశాస్త్రములను వ్రాసిరి. ఈగ్రంథములు సివిల్ వ్యవహారములను పరిష్కరించుటలో చాల తోడ్పడుచున్నవి. మంచి విద్వాంసులను న్యాయాధిపతులుగా నియమించుటచే మిక్కిలి చిక్కుగానుండు వ్యాజ్యెములుకూడ నేర్పుతో పరిష్కరింపబడుచున్నవి.

## 13 వ మేలు రెవిన్యూ వసూళ్లును; అవి సర్కారుకుకట్టు పద్ధతులును

పూర్వము రాజులకాలములో కాపులయొద్దనుండి జమచేయబడుదానిలో కొంత అవహరింపబడుచు కొంత బొక్కసమున చేరుచుండెను. కావున న్యాయముగా సర్కారునకు చెందేపైకముకంటె ఎంతో ఎక్కువమొత్తము కాపులు చెల్లించవలసివచ్చుచుండెను. ఇప్పుడన్ననో సర్కారువారుచేసిన దివ్యమైనయేర్పాట్లవలన చిన్న పల్లెటూరిలో జమయైన చిల్లిగవ్వకూడ ఎవ్వరిచేతను అపహరింపబడక సర్కారువారిబొక్కసమున. చేరుచున్నది. కావున వారు ధనమును విశేషముగా దేశోద్ధారకమైన కార్యములందు వినియోగించుటకు శక్తులగుచున్నారు. ప్రపంచములోనున్న గొప్పగొప్పరాజ్యములలో ఇండియాయొకటిగానున్నది. దీని ప్రస్తుతౌన్నత్యదశకు కారణము మనప్రభుత్వమువారు పరిపాలనవిషయమునచేసిన దివ్యమైనయేర్పాటులే. ఈక్రిందియంకెలవలన మనదేశపురెవిన్యూ ఎంతఎక్కువైనది తెలియును.

| సంవత్సరము | జమ | కర్చు |
|---|---|---|
| 1840 | 2,10,00,000 సవరనులు | 2,00,000 సవరనులు |
| 1857 | 3,20,00,000 ,, | 30,00,000 ,, |
| 1901 | 7,50, 00.000 ,, | 3,00,00,000 ,, |

ఇట్లు వసూళ్లు ఎక్కువగుటకు ముఖ్యకారణము నూతనరాజ్యప్రాప్తియే 1840 వ సంవత్సరమునకుతరువాత 5 లక్షలచదరపుమైళ్లవిస్తీర్ణముగలిగి 6 కోట్లప్రజలు వాసముచేయు దేశము ధర్మపరాయణులగు నాంగ్లేయుల వరిపాలనలోనికివచ్చినది. అంతేకాని పన్నులభారము అధికమగుటచేత కాదు. అన్నసంగతులను గమనించి ప్రస్తుతము బ్రిటిష్ఇండియా రెవిన్యూను 30, 40 స॥

వత్సరముల క్రిందటి కెనిస్ట్యాను పోల్చిచూచిన రెండుకల ప్రజలపైని భారము తగ్గియుండుటే స్పష్టమగును. అన్నిపన్నులు ప్రాతవేగాని రాబడిపన్ను ప్రావిన్షిలు రేట్లుమాత్రము క్రొత్తవి. ఈ క్రొత్తకెనిస్ట్యా ఏర్పడినపుడే ఉప్పుమీదపన్నుతగ్గించిరి. ఇండియాలోని రాకపోకల వ్యయములు తగ్గినవి. ఆ హెచ్చునకును ఈతగ్గునకును సరిపోయినది.

భాస్కరుడు.—రాబడిపన్ను కట్టి ఉప్పుపన్ను తగ్గించుటలో నేమైన మేలుగలదా? లేకున్న ఈ మార్పువలన ప్రభుత్వమువారి కేమిలాభము?

రామశర్మ.—ప్రభుత్వమువారికి లాభములేదుగాని ప్రజలకే మంచిమేలుగలిగినది. ఉప్పు బీదసాద లందఱు ఉపయోగించుపదార్థము. దీనిమీద పన్ను తగ్గించుటచేత బీదలకు సుఖముకలిగినది. ఇక రాబడిపన్ను బీదలను బాధించునది కాదు. భాగ్యవంతులను చెందునదే. కావున ధనవంతులు కొంత సొమ్మిచ్చినను చింతలేదు. బీదలకు సౌఖ్యముకలిగినదే గొప్పమేలు. ఈ సందర్భమున కర్జనుప్రభువు చేసిన యుపకారమును హిందూదేశపు ప్రజలు జ్ఞప్తియందుంచదగియున్నది. కర్జనుప్రభువుగారు ఉప్పుపన్ను తగ్గించుటయేగాక రాబడిపన్ను మునుపటికంటె ఎక్కువ ధనవంతులుమాత్రమే చెల్లించునట్లు చేసిరి. ఇట్లు ప్రభుత్వమువారు ప్రజల సౌఖ్యమే తమ పరిపాలనకు ముఖ్యోద్దేశముగా గొనియున్నారుకాని కొందఱు సత్యమెఱుంగక భావించునట్లు పేరాశచే ప్రజలనుండి ద్రవ్యము జవురుకొనుట వారియుద్దేశము కాదు. ప్రభుత్వమువారిసంతృప్తియు శాంతస్వభావమును నూతనరాజ్య సంపాదన విషయమున దెలియును. ఈవిషయమై కొందఱికిగల తప్పుఅభిప్రాయము ఈక్రిందిసంగతులవలనతొలగునుగాక.

మైసూరు సంస్థానము హైదరాలీచేతను టిప్పుసుల్తానుచేతను పరిపాలింపబడునపుడు ఆంగ్లేయులతోడ యుద్ధముసంభవించినది. తుదకు శ్రీరంగపట్టణముకోటను ఆంగ్లేయులు వశపఱచుకొనినపుడు న్యాయముగా మైసూరురాజ్యము బ్రిటిషుగవర్నమెంటువారి రాజ్యముతో కలుపుకొనబడవలసియుండెను. కా

ని వారట్లు చేయలేదు. మైసూరును హైదరాలికిముందు ఏలుచుండిన రాజకుటుంబమువారి కొప్పజెప్పిరి. మనప్రభుత్వమువారికే పేరాస యుండినయెడ న్యాయముగా వారు చేర్చుకొనదగిన రాజ్యమునే యేల విడిచిపెట్టెదరు. 1830వ సంవత్సరము ఈదేశపరిపాలనములో మిక్కిలి అక్రమముగా జరుగుచుండెను జనులనేక బాధలకు లోనగుచుండిరి. అపుడా రాజ్యకార్యనిర్వహణము బ్రిటిష్ఆఫీసరుల వశముచేసిరి. 1867 వ సంవత్సరములో ఆదేశపురాజు చనిపోయినపుడు ఆయన పెంపుడుకుమారునకు రాజ్య మప్పగించెదమని వాగ్దత్తమిచ్చి 1881 వ సంవత్సరములో తాము చెప్పినట్లుచేసిరి.

తిరువాన్కూరు సంస్థానము టిప్పూ చేతులలోనుండి విడిపింపబడి ఆదేశపురాజునకు అప్పగింపబడెను.

పంజాబులోని ముఖ్యమైన స్వదేశసంస్థానములు బ్రిటిష్దొరతనమువారి దాతృత్వమువలన నిలిచియున్నవి. లేకున్న వారి నెన్నడో రణజిత్ సింగు ఊడ్చివేసియుండును.

బరోడా సంస్థాన మొకప్పుడు మిక్కిలి దుర్నీతిపరుడైనరాజుచే పాలింపబడుచుండెను. గొప్పగొప్ప ఉద్యోగములను ఎక్కువపైకమిచ్చినవారికిచ్చుచుండెడివారు. సర్కారుపన్నులు బహుక్రూరముగా వసూలుచేసెడివారు. మర్యాదగల గొప్పకుటుంబపు స్త్రీలు రాజవీధులలో చెఱబెట్టబడి రాజాంతఃపురములోనికి తీసికొనిపోబడెడివారు. ఇట్టిసందర్భములందు బ్రిటిష్ గవర్నమెంటువారు జోక్యమునుకలుగజేసికొని ఆదేశజనులను కాపాడిరి. దేశమును తాము తమరాజ్యములో చేర్చుకొనలేదు.

మణిపురమను చిన్నసంస్థానమునందలి రాజు చంపబడి రాజ్యము మఱియొకరాజబంధువుచే అపహరింపబడెను. లార్డ్ లాన్స్డౌన్గారి యుత్తరువులప్రకారము ఆసాము చీఫ్ కమిషనరుగారగు క్వింటన్గారు విచారణచేయుటకు మణిపురమునకు వెళ్లిరి. ఆయన అక్కడచేరగానే రాజ్యము నపహరించి

న రాజుతోడ సంభాషించుటకు ఆయిన ఆయను ఆయనతో వెళ్ళినవారును పిలువబడి హఠాత్తుగా చంపబడిరి. ఇంత సాహసకార్యమునర్పబడినను లాన్స్‌డౌన్‌గారు, ఆ రాజ్యమును బ్రిటిషు రాజ్యముతో చేర్చక స్వదేశపు రాజునకే ఒప్పగించిరి. బ్రిటిషువారి శాంతసౌజన్యగుణముల కింతకన్న వేఱు నిదర్శనమేమి కావలెను.

అయోధ్యరాజ్యము చెప్పుటకు వీలు లేనంత క్రూర పరిపాలనకు లోనైయుండగా అనేక సారులు ఎన్నివిధముల చెప్పినను వినక రాజు దుష్టుల చేతికి ప్రజలను ఒప్పజెప్పి వారిని కడు బాధలపాలు చేయుచుండెను. రఘుబార్ సింగ్ అను క్రూరుడు ఒక జిల్లాకు గవర్నరై చేసిన క్రూరకార్యములనుగూర్చి యిదివఱకే చెప్పితిని, ఈ కార్యములన్ని ప్రక్కనున్న బ్రిటిష్ గవర్నమెంటువారి రాజ్యమున్న చుట్టే జరుగుచుండెను. అపుడు సర్కారువారు ఆ రాష్ట్రమును తమ రాజ్యములో చేర్చుకొనవలసివచ్చినది. ఇపుడా దేశములోని జనులు ఆంగ్లేయుల పేరు విన్నంతనే కృతజ్ఞతతో నమస్కరింతురు.

కొడగు దేశమునుకూడ, ప్రజలందరు ఏకగ్రీవముగా ప్రార్థించినమీదటనే సర్కారువారు తమ రాజ్యములో చేర్చుకొనిరి.

ఆ దేశములో జరుగుచుండిన క్రూరకార్యములు వినుటకే కష్టముగానుండును. ఇందులో అక్రమముగాగాని పేరాశచేతగాని చేర్చుకొనిన రాజ్యమేది? బ్రిటిషువారి వశమైన రాజ్యములందు ధర్మము సంస్థాపింపబడినది, జనులందరు సుఖజీవులై పాడిపంటలతోడ వర్థిల్లుచున్నారు.

## బ్రిటిష్ దొరతనమువారివలన స్వదేశసంస్థానములందలి ప్రజలకుగల్గినమేలు.

స్వదేశ సంస్థానాధిపతులు ప్రక్కనున్న బ్రిటిష్ దొరతనమువారిని మేలుబంతిగా పెట్టుకొని తమ రాజ్యపరిపాలనను అనేకరీతుల చక్కపరచుకొని తమతమ దేశముల నభివృద్ధికి దెచ్చిరి. ఇదిగాక ఆయా రాజ్యములలో అక్రమములైన జరుగుచుండిన బ్రిటిషు దొరతనమువారు హితోపదేశముచేయుట గలదు

వారి రాజ్యములు బాగుపడు మార్గములు బోధించుటయు గలదు. సమర్థులైన తమ యుద్యోగస్థులను వారికిచ్చి రాజ్యపాలనవిషయములందు వారికి తోడ్పడునట్లు చేయుటయు గలదు. కావున తమ రాజ్యముయొక్కయు తమ రాజ్యప్రజలయొక్కయు మేలును మాత్రమే పాటింపక దేశమంతయు నభివృద్ధినొందుటకు దొరతనమువారు ప్రయత్నము చేయుచున్నారు. ఇట్టి యుదారమతులును ధర్మపరాయణులు నగు నాంగ్లేయుల వశమున ఈ దేశముండుట సర్వేశ్వరుని కృపాకటాక్షవీక్షణ ఫలమే కాని వేఱు కాదు.

## 14 వ మేలు విద్యాదానము.

ఆంగ్లేయదొరతనమువారి కాలములో దేశజనులు విద్యాధికులగుటకు ఎన్నో ప్రయత్నములు చేయబడినవి. ఇంగ్లీషు విద్యవలన నూతన ప్రకృతిశాస్త్ర జ్ఞానము లభించినది. రాజకీయవ్యవహారతత్త్వము తెలియవచ్చినది. ప్రపంచములోని గొప్ప గొప్ప రాజ్యములెల్లయెట్లు అభివృద్ధికి వచ్చినది తెలిసినది. జనులకు తమయందున్న లోపములిట్టివని గ్రహించి వానిని సవరించుకొను శక్తి కలిగినది. కేవలము ఇంగ్లీషు చదువుకొనినవారు దేశములో మిక్కిలి తక్కువగానే యుండినను వారి సహవాస సంభాషణాదులచేతను వారు వ్రాసిన గ్రంథములు మొదలగువానిచేతను జనసామాన్యమునకెంతో జ్ఞానము కలిగినది. జనులు తమకుగల హక్కులు బాధ్యతలిట్టివని యోచించి వానిని గూర్చి భాషించుటకుగూడ శక్తిగలిగినది. మన దేశములో స్వార్థపరులై వేదశాస్త్రాదుల జ్ఞానము తమకే కలుగవలయునని యితరులు అంతగా విద్యావంతులు కాగూడదని మనవారిలో మనవారే ఒండొరులను వంచించుట మన మెఱుగుదుము. తుదకు మన కుటుంబములోని స్త్రీలే చదువుకొనకుండ పురుషులు చేయుచు వచ్చిరి. దీనికి కారణము స్వార్థపరత్వమే. ( Selfishness ) గాని వేఱు కాదు. ఇట్టి స్వార్థపరత్వమే, జాతివైషమ్యమే మనల నిట్టి గతికి తెచ్చినది. పూర్వము జ్ఞానతేజమును మనవారు ఇతర దేశవాసులకొసగి అక్కడి యజ్ఞానాంధకారమును బాపుచు వచ్చిరి. ఇప్పుడన్నో అజ్ఞానాంధకార నిమగ్నులమగు మనకే యితర దేశవాసులు సుజ్ఞానదీపము నిచ్చి ప్ర

కృతియొక్క సత్యస్థితిని తెలియజేయుచున్నారు. ఇప్పుడు మిక్కిలి నాగరికతగల దేశములు పూర్వము నాగరికస్థితిలోనున్నప్పుడు వారికి బోధకులగు మనవారు బోధకులైయుండిరి. చదివిన శాస్త్రమును మఱచిన గురువునకే శిష్యుడు నేర్పవలసివచ్చినట్లు, వారే మనవారికిపుడు బోధింపవలసివచ్చినది. పూర్వమెప్పుడో మనవారు గొప్పవారైయుండిరని చెప్పుకొని సంతోషపడుటవలన లాభములేదు. ప్రస్తుతస్థితి నికృష్టముగానే యున్నది. మనదేశములో నూటికి 90 మంది చదువురానివారైయున్నారు. విద్యరానివాడు వింతపశువను మాట అబద్ధము కాదుగదా. ఇంక స్త్రీలన్ననో నూటికొక్కరుదక్క తక్కిన 99 మందియును చదువురానివారైయున్నారు. ఆంగ్లేయప్రభుత్వమువారు రాకపూర్వము ఇంతకన్నను మనవారి స్థితి హీనముగానే యుండినది. ఈ దేశోద్ధారణమే ముఖ్యోద్దేశముగాఁగల్గి ఉదారస్వభావులును పరోపకారమతులు నగు ఆంగ్లేయప్రభుత్వమువారు మనము విద్యావంతులమగుటకు ఎంతో శ్రమపడుచున్నారు. ఇందుకొఱకు కొన్ని పాఠశాలలను కళాశాలల నేర్పఱచి బహుమానములను విద్యార్థిభృతులను నిచ్చుచు ప్రోత్సాహము కలుగజేయుటయేగాక నేర్పబడుచుండు విద్య ఉత్తమమార్గమున నేర్పబడునట్లు కనిపెట్టిచూచుచుండుట కొందఱనో యినస్పెక్టర్లను నియమించిరి, 1857 వ సంవత్సరమున మూడు యూనివర్సిటీలు స్థాపింపబడినవి.

పాఠశాలలకు గ్రాంట్లు ఇచ్చుపద్ధతి ప్రారంభింపబడినది. 1858 వ సంవత్సరమునందు 13 కాలేజీలు ఉండినవి. 4,00,000 విద్యార్థులుండిరి.

| | | | |
|---|---|---|---|
| (1) | 1865 | 26 | 1582 మందిఅందరు గ్రాడ్యుఎట్లు చదువుచుండిరి |
| | 1907 | 179 | 26,000 |
| (2) | 1865 వ సం॥ లో | 19,201 పాఠశాల | 6,19,260 విద్యార్థులుండిరి. లుండెను. |
| | 1907 | 1,65,473 | 57,08,000 |



(3) 1858 వ సంవత్సరమున విద్యావిషయ 39,40,000 రూపాయలు పైన కర్చుమొత్తము.

1865 67,10,000

1907 6,00,00,000

(4) 1871 వ సం॥ న 10,000 ఆడపిల్లలు చదువు నేర్చుచుండిరి,

1901 1,28,000

ఇట్లు విద్య ఆంగ్లేయుల పరిపాలనలో 30, 40 సంవత్సరములలో పదింతలు హెచ్చినది.

| హిందూదేశ జనసంఖ్య. | పురుషులు. | | స్త్రీలు. | |
|---|---|---|---|---|
| | చదువువచ్చినవారు | రానివారు | చదువువచ్చినవారు | రానివారు |
| 29,43,60,000 | 1,51,99,000 | 13,47,52,000 | 14,33,000 | 14,29,76,000 |
| | 14,99,51,000 | | 14,44,09,000 | |

ఈయంకెలనుబట్టి పురుషులలోను ముఖ్యముగా స్త్రీలలోను విద్య యెంత అభివృద్ధికావలసియున్నదో తెలియుచున్నది. ఇందరుస్త్రీలు అజ్ఞానదశయందున్నప్పుడు దేశాభిమానులకు నిద్ర యెట్లుపట్టుచున్నదో తెలియకున్నది. ఈవిషయమై సర్కారువారు ఎంతసహాయముచేయుటకు సిద్ధమైయున్నను ప్రజలు

తమ ఆడుబిడ్డలను పాఠశాలలకు పంపకున్న వారేమిచేయగలరు. బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముపంతులువారివంటి దేశాభిమానులు పాఠశాల లేర్పఱచి విద్యనుగోరు బాలికలకొఱ కెదురు చూచిచూచి యెవ్వరు రాకుండుటచే యూరకుండవలసినవారగుచున్నారు. మన దేశమునకు పెక్కురీతుల ఉపకారులైయున్న మిషనరీవారును పాఠశాల లేర్పఱచిరి. కాని అందులోని పెద్ద తరగతులలో చదువుకొను హిందూబాలికలు మిక్కిలిఅరుదు. మహమ్మదీయ బాలికలసలే లేరు.

## విద్యాబోధకులను సిద్ధపఱచుట.

విద్యాభివృద్ధినొందించుటకు మంచిమార్గముల ననుసరించి విద్య నేర్పగల బోధకులును కావలసియుందురు. గనుక అట్టివారిని సిద్ధపఱచుటకు ట్రెయినింగ్ కాలేజీలు, నార్మల్ స్కూళ్లు ఏర్పఱుపబడినవి. స్త్రీలకు స్త్రీలే బోధకులగుట ఎక్కువ అనుకూలమగుటచే అట్టి విద్యార్థినులకు మిగుల ప్రోత్సాహము కలుగజేసి విద్యాబోధకురాండ్రుగ తరిబీయతు అగుటకు బహుమాన వేతనముల నేర్పఱిచియున్నారు. దేశోద్ధారకమైన యీ కార్యమునకు క్రైస్తవమతస్థులే ముందుకువచ్చుచున్నారు.

## విద్య హెచ్చుటవలన సర్కారువారికిగల్గు మేలు.

మూఢులను పరిపాలించుటకన్న సుజ్ఞాన సంశోభితులు యుక్తాయుక్త విచక్షణులైన వివేకులను పరిపాలించుట మిగుల అనుకూలము. ఇట్టివారు సర్కారువారికి తోడ్పడుచు దేశ మభివృద్ధినొందుట కత్యంత శ్రద్ధాళువులై యుందురు. తమ తమ సంఘములలోనుండు దురాచారములను తొలగింపజేయుదురు. ఆరోగ్యమార్గము నవలంబింతురు. దుర్నీతి యిందువలన నశించును. ప్రజలు దేహబల మనోబలమును గల్గి వర్ధిల్లుదురు. విద్యావంతులగు ఉద్యోగ

స్థులు దైవభక్తి పాపభీతిగల్గి "సత్యంవద, ధర్మంచర" యను ఆర్యవాక్యముల ననుసరించి న్యాయమార్గానువర్తులై సంచరింతురు. ఇద్ది దేశమునకును దేశపాలకులకును నెంతమేలో యోచింపుము. ఆంగ్లేయులు మనకొసర్చిన గొప్పమేళ్లన్ని యొకయెత్తు, సత్యజ్ఞాననేత్రము నొసంగినది మఱియొకయెత్తుగా భావింపనగును.

## నూతన పద్ధతులప్రకారము చదువునేర్పుట.

చదువునేర్పుటయందు ఇప్పుడిప్పుడు నూతనపద్ధతు లవలంబింపఁబడుచున్నవి. పూర్వపు గుంటఓనమాలు ఎప్పుడోపోయినవి. ఒక్క సంవత్సరము వరకు అరచి అరచి ఒగర్చినగాని రానియక్షరాలు, ఇప్పుడు ఆటలు పాటలుగ నేర్పించినను నెల రెండు నెలలో వచ్చుచున్నవి. 15 దినములలో అక్షరము లన్నివచ్చినవారును, అక్షరములు ప్రారంభించిన ఏడాదిలో మూడవ వాచకపుస్తకముకూడ ముగించినవారును కలరు. ఇటీవుల మఱియొక మార్పు కలిగినది. విద్యార్థులు విషయజ్ఞానములేక చిలుకవలె పలుకుచు గుడ్డిపాఠము చేయుచు బుద్ధి మందగించినవారు కాక ప్రకృతి స్వరూప స్వభావాదులను అనుభవసిద్ధముగ నేర్చుకొనుచు ప్రకృతియే చదువనగు పుస్తకముగా భావించుచు నిజమైన జ్ఞానమును ప్రజ్ఞయు, వివేకమును కలవారగునట్లు అధికారులు విద్యాబోధనవిషయమున క్రొత్త క్రొత్తపద్ధతుల నవలంబించుచున్నారు. ఇదియుంగాక పూర్వము మనపండితులవలె తనకు ఇష్టమైనశాస్త్రమును ఆమూలాగ్రముగ నేర్చుకొను పద్ధతులను అమలులోనికి తెచ్చుచున్నారు. ఇందువలన ఆయాశాస్త్రములందొక్కొక్కరికి పరిపూర్ణపాండిత్యమేర్పడును. అన్నివిద్యలయందు వ్రేలుపెట్టి ఒక్కవిద్యయు చక్కగా రాకుండుటకంటె ఏదేనొకవిద్యను అభిమానవిద్యగా గ్రహించి దానియందు చక్కని ప్రజ్ఞను సంపాదించుట మంచిపనికదా. ఈమార్పులయందు కర్జనుగారిజోక్యము చాలకలదు, "ఓడు ఓడన కంచమంతయు నోడు ఓడ"ను నట్లు కర్జనుగారుచేసిన పన్నియు అననుకూలకార్యములుగా భావించువారును మనదేశమున గలరు.

ఇది గొప్పపొరబాటు. కర్జనుగారిని సామాన్యునిగా నెంచఁదగదు. ఆయన మిగుల దూరదృష్టిగలిగి తన యఖండప్రజ్ఞను, నపార శేముషీసంపదను ఈ దేశాభివృద్ధి నుద్దేశించి వినియోగించెను. ఆయన చేసిన మార్పుల ఫలితములు సావధానచిత్తులమై చూడనగును గాని చిత్తశాంతిలేక యట్టివిట్టివని వానియం దనాదరణ చూపుట యుక్తముగాదు.

ఝానక్రుఁడు—ఇప్పుడు పాఠశాలలో నన్నిట జీతము లెక్కువచేసి అందరకు నసాధ్యముగానుండవలసినవిద్యను సంపన్నులకుమాత్రమా లభ్యమగునట్లుచేయుట మేలు కాదుగదా,

రామశర్మ—లోకములో నన్నిటికిని వెల ఎక్కువైనది. దీనికికారణము ముందె వివరించితిని. స్కూళ్లనుపెట్టిన యిండ్లఅద్దెలు ఎక్కువయినవి. విద్యనేర్పు ఉపాధ్యాయుల జీతము లెక్కువైనవి. ఇంకను కానున్నవి. పూర్వమునకంటె మేలైన భవనములు కావలసివచ్చినవి. నూతనపద్ధతులప్రకారము విద్యనేర్పుటకు క్రొత్తవస్తువులును ఉపకరణములును అమర్చవలసియున్నవి. ఈ కాలమున పాఠశాలలు అందమైన ప్రదర్శనమందిరములుగా, చిత్రవస్తుశాలలు, వీలైనచో నానావృక్షశోభితములగు ఆరామములుగలవియుగా గూడ చేయవలసియున్నది. విద్యార్థులకు ప్రత్యక్షమును అనుభవసిద్ధమునగు జ్ఞానము అలవడునట్లు ప్రకృతి తత్త్వసత్వమిట్టిదని కన్నులార వారుచూచి, చేతులారచేసి, గ్రహించుట కనుకూలము లేర్పరుపవలసియున్నది. దీనికంతయు నెంతో ద్రవ్యము కావలసియున్నది. ధనవంతులేగాక బీదలుకూడ తమ యభిమానవిద్యాశాలలకు ధనసాహాయ్యము చేయుచున్నారు. ఇట్టిసందర్భములందు విద్యార్థులీయవలసిన జీతములు కొంచెము హెచ్చు చేయుట గొప్పతప్పా!

## 15 వ మేలు పోలీసువారు.

దేశము నెమ్మదిగా నుండిన గాని యేవిద్యనేర్పుటకైనను వియభివృద్ధికర ములైన మంచిపనులు చేయుటకైనను వీలుకాదు. కావున దేశముమంచిస్థితిలో నుండుటకును నానాట అది యభివృద్ధినొందుటకును పోలీసుసిబ్బంది ముఖ్యము గా నుండవలసియుండుటయేగాక వారు ధర్మబుద్ధిగలవారును, ఈశ్వరప్రీతిగా పనులు చేయువారునై యుండవలయును. ఆంగ్లేయప్రభుత్వము ఏర్పడుటకు ముందు దేశ మెట్టికల్లోలస్థితిలోనుండెనో యింతకుపూర్వమే వివరించితిని. మన దొరతనమువారి కాలములో చక్కని పోలీసుసిబ్బందియు ప్రజలకు రక్షకము ను నేర్పడెను. కాని యింగ్లాండులోవలె ఈదేశములోపోలీసుభటుడు నిర్మొగ మాటముగా నిర్భయముగా విధ్యుక్తములగు తనపనులను నెఱవేర్చుటకు సమర్థుడు కాకున్నవాడు. ఈవిషయమును చక్కగా ఆలోచించి కర్జనుప్రభువుగారు ఈ డిపార్టుమెంటులో కొన్నిమార్పులను జేసిరి. ఈడిపార్టుమెంటులో కొద్దిజీతము తీ సికొనుచున్న ఉద్యోగస్థుడుకూడ తనపనులను చక్కగా నెరవేర్చుచుండినచో రానురాను గొప్ప యధికారపదవిని పొందవచ్చును. కావున పోలీసుడిపార్టు మెంటులో ప్రతివారును మంచిమంచిపనులుచేసి కీర్తిప్రతిష్టలు పొందవలెనని మిగుల ఆసక్తితో పనిచేయుచున్నారు. కావున కర్జనుగారు ఈడిపార్టుమెంటు లో చేసినమార్పులు మిగుల దేశోపకారకములైనవి.

## 16 వ మేలు దేశాభివృద్ధినిమిత్తము చేయబడిన యితరకార్యములు.

1 కర్జనుగారు యింకను కొన్ని సత్కార్యములు చేసిరి.ఖనిజశాస్త్ర ప్ర వీణులను నియమించిరి. ఈశాస్త్రజ్ఞులు దేశములో నెక్కడెక్కడభూమిలో, కొండలలో, గనులుకలవో కనిపెట్టి వానిని త్రవ్వియెత్తుప్రయత్నములు చేయు

ఉందురు. భూమిలో పాతిపెట్టిన బంగారుకొప్పెరలు దొరకుటకంటె క్రొత్తగనులు లభించుట దేశమునకు ఎక్కువలాభకరము. నిజాము రాజ్యములోని సింగరేణిబొగ్గుగనులు, మైసూరు సంస్థానము నందలి బంగరుగనులు నెల్లూరుజిల్లాలోని అభ్రకపుగనులు దేశమునకెంతలాభకరములుగా నున్నవో వివరింపవలసినయక్కరగలుగదు.

II వృక్షములకు, పైరులకు పట్టెడి చీడయొక్క కారణములను ఆచీడపురుగులు ఏమందులవలన నశించునో ఆమందులను కనుగొనుటకును పశువులకు గలుగువ్యాధులను వానికిదగు చికిత్సలును కనుగొనుటకును శాస్త్రజ్ఞులేర్పఱుపబడిరి. ఇదిగాక, యిట్టి విషయములను గూర్చి యిండియా గవర్నమెంటు వారికి సలహాల నందించుటకు సమర్థులయిన శాస్త్రజ్ఞుల సభ యేర్పఱుపబడియెను.

III పిచ్చికుక్క మొదలగుజంతువులకాటుచే రోగులు చావకుండ ఉచితముగా చికిత్సచేయుటకు కసౌలీలో నొకవైద్యశాల యేర్పఱుపబడెను. 1902 సం॥లో 500 మంది ఈశాలలో చికిత్సనొందిరి. ఇటీవల దక్షిణయిండియాలోకూడ నిట్టిశాలనే నిర్మించిరి. ఈకార్యము లన్నియు దేశోపకారకములు గావా? వీనినొనర్చినవారు మనకుపకారులా? అపకారులా? కర్జనుప్రభువుగారు అన్నిడిపార్టుమెంట్లలోను భక్కనిపూర్ప్పులన్నుజేసి తన బుద్ధికుశలతను గనబఱచెను.

## చిత్రశిల్పశాలలు

చిత్రలేఖన, ఱాళ్లు ప్రతిమలుగాచెక్కుట మంటితో అందమైనపాత్రలు చేయుట పూలుఅల్లుట చెప్పులుకుట్టుట మొదలగు చేతిపనులను నేర్పుశాలలును ఎన్నియోయేర్పఱుపఁబడినవి.

ఈదేశము అభివృద్ధినొందుట కెట్టిప్రయత్నములైన చేయుటకు ఆంగ్లేయప్రభుజనులెల్లరు సిద్ధముగానున్నారని యిక్కడ అనేక సంవత్సరములు. మును

తోనుండి గొప్పగొప్ప యుద్యోగములు చేసి సీమకు వెళ్లియున్న ఒక దొరగారు వ్రాసిరి. ఈవాక్యము సత్యమనుటకు సందియము పడువారు ఈదేశమునందు నొకరుండరని నమ్మెదను.

## 17 వ మేలు వ్యవహారములను నిర్వహించు శక్తిగలుగుటకు మనలను తరిబీయతుచేయుట.

మనదేశపరిపాలనమార్గములనుకూడ మనదొరతనమువారు మనకు నేర్పుచున్నారు. దీనివలననే వారి యుదారస్వభావము వెల్లడికాకమానదు. గొప్పగొప్పపట్టణములను మనచేతికిచ్చి మనలను నేలుకొమ్మనిచెప్పియున్నారు. వారు పైనుండి కనిపెట్టుచు లోపములను దిద్దుచు మనలను తరబీయతు చేయుచున్నారు. ఈమునిసిపల్ పరిపాలనలవలన మనయందలిలోపములు వెల్లడియగుచున్నవి. కావున మనము బాగుపడుటకు అవకాశమేర్పడుచున్నది. లోకల్‌బోర్డు, డిస్ట్రిక్టుబోర్డును దేశపరిపాలనను నేర్పు విద్యాశాలలుగా నున్నవి. గ్రామములలో పంచాయితీల నేర్పఱచుకొని మనతగవులను మనము తీర్చుకొనుటకు సర్కారువారు విధుల నేర్పఱచిరి. గౌరవార్థము మేజస్ట్రీటులనుగా పౌరులలో మర్యాదస్థులైనవారిని నేమించుచు ప్రజాపాలనయందు మనకు జోక్యము కలుగ చేయుచున్నారు.

## 18 వ మేలు అడవులపరిపాలన.

అడవులను విచ్చలవిడిగా విడిచిపెట్టక వానిని సంరక్షించుటకును నభివృద్ధిచేయుటకును నొకసిబ్బందిని యేర్పఱచియున్నారు. ఈయడవులవలన రాజ్యాంగమువారికి చాలధనము లభించుచున్నది. అడవులయందు పండెడిపంటలను వృథసేయక వానివలన దేశమునకు ధనము సంపాదించిపెట్టుట దేశమునకు లాభకరమైన కార్యముగనుగదా.

భాస్కరుడు:—అడవుల పరిపాలన జనులకు నిర్బంధకరముగా నున్నదనియు పూర్వము అడవిలో ఎవరియిచ్చవచ్చినట్లెల్ల వారు కట్టెలు కొట్టుకొనుచుండెడివారనియు, కట్టెపుల్లలు తెచ్చుకొనుటకు గూడ వీలు లేకున్న బీదసాదలు బ్రదుకుటెట్లనియు జనులు చెప్పుకొనుచుందురు. జనులను ఇట్టికష్టములను పెట్టుట పాడికాదుగదా!

రామశర్మ:—భాస్కరా! పూర్వ మెక్కడచూచినను మహారణ్యము లధికముగానుండెనవి. ఇప్పుడు అనేకప్రదేశములందు చెట్లుకొట్టి వానిని శుభ్రపఱచి దున్ని పంటలు పండించుచున్నారని చెప్పియుంటిని. పట్టణములు పల్లెలు నానాట యభివృద్ధి నొందుచున్నవనియు జనసంఖ్య హెచ్చుచున్నదనియు జెప్పియుంటిని గదా. ప్రస్తుతము దేశమునందలియరణ్యములను సంరక్షింపక ఎవరియిష్టమువచ్చినట్లెల్ల వారిని విచ్చలవిడిగా కట్టెలు కొట్టుకొననిచ్చినచో నరాకురనకువచ్చెడి రాబడిపోవుటటుండ అరణ్యములు తక్కువయి కొన్ని సంవత్సరములకు వలసినన్ని చెట్లులేకపోవును. అపుడు మనదేశములోని 30 కోట్లప్రజలగతియేమగునో యోచింపుము. ఇండ్లుకట్టుకొనుటకు దూలములు, వాసములు, శ్రేణులు ఎక్కడనుండి తేవలెనో చెప్పుము. దూరదృష్టిలేనిప్రజలు నేటి రేపటిసంగతిమాత్రము చూచుకొందురు. ప్రభుత్వమువారు దూరదృష్టి పరులై దేశక్షేమమును మదినుంచి ముందురాగలసంగతులను తలంచి తదనుగుణముగా వర్తింతురు కావున అడవివిషయమున వారుచూపుచుండు నిర్బంధములు కాపులకు ప్రస్తుతమున కొంచెము కష్టముగా నుండినను దేశముయొక్క క్షేమమునకవి చాల యావశ్యకములని నమ్మవలయును.

దొరతనమువారు అడవులు విచ్చలవిడిగా కొట్టబడకుండ జాగరూకులై చూచుచుండుటయే కాక నశించినచోటు భర్తీగా క్రొత్తచెట్లనువేసి పెంచుటకును, ముందుకు ప్రజలకు కావలసివచ్చెడి కలప, వంటచెఱకు, మొదలగునవి నిరాఘాటముగా దొరకునిమిత్తము వలసిననిన్ని ప్రయత్నములోనర్చుటకును ఎంతో శ్రద్ధ వహించియున్నారు. ఎండిన వృక్షములు నిప్పుసోకినను సులభముగా మండును గనుక అడవిలోనికి నిప్పును తీసికొనిపోనీయరు. పూర్వము కార్చిచ్చులచే గొప్పగొప్పయడవులు కాలి బూడిదెయగుచుండెనని వింటిము. అట్టి యకర్టట్టు సంప్రాప్తించకుండ అన్నివిధముల నరణ్యములను కాపాడునిమిత్తము ప్రతిజిల్లా యందును పెద్ద సిబ్బందిని పెట్టియున్నారు. ఇట్లు 92 వేల చదరపుమైళ్ల విస్తీర్ణముగలయడవులు కాపాడఁబడుచున్నవి. ఈయడవుల వలన సంవత్సరమునకు రమారమి 2 కోట్ల 70 లక్షలరూపాయలు వచ్చుచున్నవి. కర్చులన్నియు పోగా 1 కోటి 20 లక్షలరూపాయల ఆదాయము తేలుచున్నది. ఇట్లు ప్రస్తుతమున లాభమును, ముందుకు క్షేమమును, కలుగుచున్నది. ఇది యెంతమేలు! బ్రిటిషురాజ్యముతో అమలులోనున్న పద్ధతులనే స్వదేశసంస్థానములవారును అవలంబించి ఎంతో లాభమును పొందుచుండుటనుబట్టియే ఆపద్ధతు లెంతమంచివైనవో మన మూహింపవచ్చును.

## 19 వ మేలు టపాలా ఆఫీసులు, తంతివార్తలు.

టపాలా ఆఫీసులనుగుఱించియును, తంతివార్తలనుగుఱించియును నింతకుమున్నే సూచించియున్నాను. ఇవి దేశమునకు చేసినమేలు ఇంతింత కాదు. పూర్వము దూరదేశములందుండినవారికి ఎవరువచ్చినది, ఎవరు బ్రతికియున్నది కూడ తెలిపెడిది కాదు. ఎవరైన వెళ్ళుచుండినపుడు తమ కష్టసుఖములను చెప్పి పంపుచుండెడివారు. మహమ్మదీయుల కాలములో కొంతవరకు టపా యేర్పాటు వాడుకలోనికివచ్చెను గాని యిప్పుడున్న యనుకూలములలో సహస్రాంశమైన నప్పుడు లేదు. మొట్టమొదట 1858 వ సంవత్సరములో ఇంగ్లాండుయం

నున్న టపాయేర్పాటు ఇండియాలోని వాడుకలోనికి వచ్చినది. అప్పటి నుండి రానురాను అభివృద్ధినొందుచువచ్చినది. ఇప్పుడొక్క కాణి, రెండుకాణులు పుచ్చుకొని సర్కారువారు మన ఉత్తరములను, కొండలను, నదులను, అడవులను దాటి సముద్రముమీదుగా ఇనుపదారులమీదుగా రస్తాలమీదుగా అనేక వేల మైళ్లదూరము తీసికొనివెళ్లి భద్రముగా మనము కోరినవారికిచ్చుచున్నారు. ఇపుడను దినచర్యయును సుఖగోష్టిరూపముగా మన మిత్రుల కెల్లరకు తలచినపుడెల్ల జాబులు వ్రాయగల్గియున్నాము. ఇట్లె టపాలా అధికారులు అత్యల్ప పారితోషకము గ్రహించి మనము కట్టిన సొమ్మను ఎన్ని వేల మైళ్లదూరములో నున్నవారికైనను భద్రముగా చెల్లించుచున్నారు. మనమిచ్చిన రూపాయలను, అర్ధలను, పావలాలనుగూడ భద్రపరచియుంచి వడ్డీతోకూడ మన మడిగినపుడిచ్చుచున్నారు. ఇదిగాక వార్తాపత్రికలను దెచ్చి యిచ్చి ప్రపంచములో నేమూల జరుగుచున్న విశేషములైనను దేశమంతయు వెల్లడిచేయుచున్నారు. ఎన్నివందల మైళ్లదూరములోనున్న వారికైన నరగంటలో మనము వార్తలను టెలిగ్రాఫు మూలమున తెలియబరుపగలిగియున్నారము. ఇట్టి యనుకూలములవలన మన దేశమున వర్తకవ్యాపారమునకుగల్గిన మేలింతింత కాదు. ఇట్టి సౌఖ్యములు ప్రజలకమర్చిన దొరతనమువారి యుపకారమెన్నటికైన మఱచుటకు సాధ్యమగునా?

## 20 వ షేఁలు క్షామములందు జనసంరక్షణ.

పూర్వము క్షామకాలములందు ఎక్కుడి జనులకూడు ఆకలిచిచ్చునకోర్వలేక మలమలమాడి చచ్చుచుండెడివారు. ఆంగ్లేయులీదేశమును పాలింపదొడంగినమీదట క్షామోపద్రవము కలుగకుండ దేశమందు గొప్ప గొప్ప నదులకన్నిటికి ఆనకట్టలుకట్టి నీరుపారుదల సాధనముల నమర్చుటనుగూర్చి యిదివరకే వివరించియుంటిని. ఒకవేళ నీరులేనిప్రదేశములో వర్షములు కురువక

క్షామముకల్గుగనుండినను పండినయూళ్ళనుండి వెంటనే ధాన్యమువచ్చిచేరి ప్రజల బాధను నివర్తింపుచున్నది. ఈ దేశమునందు పండినపంటలు చాలకున్న బర్మానుండిగాని, అమెరికామొదలగు ఖండాంతరములనుండిగాని ఓడలనిండుగా ధాన్యము వచ్చిచేరుచున్నది. ఒకప్పుడు క్షామకాలమున దయామయులగు అమెరికావారు ధర్మార్థముగా ధాన్యమును పొగయోడలమీద మన దేశమునకు పంపియున్నారు. కావునక్షామబాధ పూర్వమువలె జనులను బాధించుటలేదు. ఒకవేళ బాధించినను, దొరతనమువారు జాగరూకులై బీదలకుపనియిచ్చి గంజిపోసి పోషించుచున్నారు. 1874 వ సంవత్సరములో దర్భంగాయను నొక్క జిల్లాలోనే బీదలను సంరక్షించునిమిత్తము సర్కారువారు 2 కోట్ల 25 లక్షల రూపాయలు వ్యయపరచిరి. ఈ మొత్తము ఆజిల్లావలన సర్కారువారికి 30 సంవత్సరములకుకూడ తేలదు. భాస్కరా! చూచితివా ప్రభుత్వమువారి దయార్ద్రహృదయ మెట్టిదో!

ఇప్పుడు సర్కారువారు క్షామమునాపు పనులకుగాను సంవత్సరముసంవత్సరమును 1 కోటి 50 లక్షల రూపాయలు బడ్జెటులో ఏర్పాటు చేయుచున్నారు.

భాస్కరా! ఆంగ్లేయరాజ్యాంగమువారు మనకొనర్చిన యుపకారములనెల్ల సవిస్తరముగా వర్ణించుటకొక సంవత్సరమైనను చాలదు. వారిప్రభుత్వమునందు మనముపొందినలాభములు గణనాతీతములుగానున్నవి. ముఖ్యమైనవి కొన్ని సంగ్రహముగా జెప్పితిని. ఇట్టి వీర్యవంతులును, సత్కీర్తిశోభితులును, సుదారస్వభావులును, ధీరమతులును మన దేశమును నేలునట్లొనర్చినందులకు దయామయుండగు సర్వేశ్వరునకు మనము వేనవేలు వందనములాచ

ంచవలసియున్నది. సజ్జనపుంగవులగు నాంగ్లేయుల ప్రభుత్వలక్ష్మి యాచంద్రార్కముగ వర్ధిల్లునట్లు సర్వరక్షకుం డాశీర్వదించును గాత.

ఆంగ్లేయ మహాజనులు మనదేశమునకొనర్చిన మేలు మనమెప్పటికిని మరువకుందుము గాత.

సర్వే జనా స్సుఖినో భవంతు.



వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారిచే సత్యబోధినీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.